

# శాంకర
# వేదాంత అమృతోపదేశములు

## ( FUNDAMENTALS OF SANKARA VEDANTA )

# శాంకరవేదాంత అమృతోపదేశములు

(Fundamental Principles of Sankaravedanta)

## 1. వేదాంత జ్ఞానమునకు కావలసిన యోగ్యత

శంకర సప్తాహము వస్తున్నది. వానికి ముందునుండే ఈ సంవత్సరము కొన్ని ఉపన్యాసములు జరుపువలయునని మీరు ఆపేక్షించినట్లు ఈ ఉపదేశ మాలికను ప్రారంభించుచున్నాను. ఈ సప్తాహసందర్భములో ముఖ్యముగా శంకర భగవత్పాదుల వారికి సమ్మతమైన విచారములనుగురించే చెప్పవలసియున్నది. విషయము తెలియుటకు కొద్దిగా కఠినముగా ఉండవచ్చును. సాధనసంపత్తి ఎంతవరకు అలవడియుండునో, దానిననుసరించియే మనసుకు విషయము బోధపడును.

వేదాంతమును ఉపనిషత్తుల వివరణద్వారా లేక పక్ష-ప్రతిపక్షములను పట్టుకొని వాదన చేయుటద్వారా తెలియుటకు యత్నించవచ్చును. ఇటువంటి సందర్భములలో ఈ రెండు మార్గములును కుదరవను దానిని చెప్పనక్కరలేదు. ఇంకనూ ప్రత్యక్షానుమానాది ప్రమాణముల ఆధారముతోనూ ప్రమాణమును శుద్ధము చేయుతర్కముతోనూ తెలుసుకొనుటకు బయలుదేరుట ఏవిధముగానూ సరికాదు. ఎందుకనగా వేదాంతతత్త్వము ప్రమాణ గోచరమే కాదు. ఉపనిషత్తుల యందుగాని, భగవద్గీతయందుగాని తత్త్వమును ప్రమాణముతో తెలుసుకొన వచ్చునను ఊహకవకాశమే ఇయ్యలేదు. పరమాత్మతత్త్వము 'అప్రమేయము, ప్రమాణములకు అందునది కాదు' - అనియే స్పష్టముగా చెప్పినది. అలాగయినచో ఈ తత్త్వమును ఎట్లు తెలిసికొనవలయును ? అనగా దీనికి 'వేదాంత విజ్ఞాన సునిశ్చితార్థాః అను శ్రుతి వాక్యమే సమాధానము. వేదాంతవిజ్ఞానముతో సునిశ్చితముగా ఈ తత్వమును తెలుసుకొనవచ్చును. 'వేద' మనగా యేది ప్రత్యక్షాది ప్రమాణములకు కూడా అందని అర్థమును మనకు చూపించగలదో

అపౌరుషేయమైన వేదము ద్వారానే తత్త్వమును తెలిసికొనవలసినదిగా నున్నది. వేదాంతములు అనగా ఉపనిషత్తులు - వేదము యొక్క భాగమైన అరణ్యకముల చివరలయంద చాలావరకు వచ్చుటచేత వాటికి ఈ పేరప కలిగియుండవచ్చును. అయితే ఇదే 'చివరమాట' అన్నట్లు ఈ తత్త్వజ్ఞానమే వేదముతో కలుగునటువంటి జ్ఞానముయొక్క అంతిమ తీర్మానము, ఇది వచ్చినతర్వాత తెలియవలసినది కాని, చేయవలసినది కాని మిగిలియుండదు, అను అభయమును ఇచ్చుటవలన కూడా ఇక్కడ చెప్పిన సిద్ధాంతమును 'వేదా ఏత' మను పేరుతో పిలువచ్చును.

ఇటువంటి జ్ఞానము వచ్చుట ఎట్లు సాధ్యము ? అనుదానిని ఇకముందు వివరించుటకు ప్రయత్నించెదము. అయితే వేదాంత జ్ఞానముయొక్క విషయములో మనకిప్పుడున్న తప్పు భావనలను మొదట వదలిపెట్టవలయును. అది అతీంద్రియ విషయకమైన జ్ఞానమగుటవల్ల దానిని ఏ ఇంద్రియము ద్వారానూ తెలిసికొనుటకు వీలులేదు. వేదమందు చెప్పిన కర్మ, ఉపాసన, జ్ఞానము - ఈ మూడింటికికూడా అతీంద్రియ ఫలమే కలుగును. వేదమందు చెప్పిన కర్మకు ధర్మమని పేరు ఉన్నది. దానిని ప్రధానముగా శరీరముతోనే చేయవలసి యున్నది. ఉపాసనను వేదమే చూపించును. ఉపాసన మనస్సుతో చేయతగినది. దానిని కర్మవలె చేయుటకు, విడచుటకు, మనసుకు ఇష్టమైనట్లు చేయుటకు వీలగును, కాబట్టి అదియునూ కర్మేయగును. కర్మ అనగా పనే అయినప్పటికి శాస్త్రమందు చెప్పిన కర్మనే ఇక్కడ ఎట్లు తెలుసుకొనవలయునో అలాగే ఉపాసనే అయినప్పటికీ శాస్త్రోక్తమైన ధ్యానము అనే తెలియువలయును. ఈ రెండింటికి దృష్టమైన లేక అదృష్టమైన - ఈ లోకమందు ఫలములు రావచ్చును కర్మకు దాని ఫలమునకు ఉన్న సంబంధముగాని, ఉపాసనకు దాని ఫలమునకు ఉన్న సంబంధముగాని శాస్త్రముద్వారా మాత్రమే తెలిసికొనదగినదిగా యుండుటచేత ప్రత్యక్షాది ప్రమాణములు దానిని తెలియవరచలేవు. శాస్త్రమొక్కటే ఇక్కడ ప్రమాణము, శ్రద్ధతో శాస్త్రమందు చెప్పినదానిని నమ్మువారికి మాత్రమే వాటివల్ల కలుగు ఫలము దొరుకును.

ఇంక వేదాంతోక్తమైన విజ్ఞానము అనగా అది శాస్త్రముతో తెలుసుకొనవలసినదై యున్నది. అయితే దానిఫలము ఇక్కడే ఇప్పుడే అనుభవమునకు వచ్చునదై యున్నది. 'నీవు బ్రహ్మైయున్నావు' అని వేదాంత చెప్పినచో దానిని అధిగారియైన వాడు ఈ జన్మమందే మనసుకు వచ్చునట్లు చేసికొని ఫలమును ఇక్కడే అనుభవించవచ్చునని శాస్త్రము చూపించుచున్నది. అతీంద్రియమైన ఫలము దృష్టమయినది అనగా ఎట్లు ? అతీంద్రియమైన తత్త్వజ్ఞానమును శాస్త్రమైననూ ఏవిధముగా చూపించును? మనము దానిని సంపాదించుకొనుట ఎట్లు శక్యమగును? అని మీరు అడగవచ్చును. దీనిని ఈ ఉపన్యాస మాలికను వింటూ పోయినచో తెలుసుకొనవచ్చును. అయితే ప్రస్తుతమునకు ఇక్కడ ఇంతమాత్రం మనము నమ్ముకొనవచ్చును. మనుష్యుడు అనాగరికస్థితియందున్నప్పుడు చదువుటయూ, వ్రాయుటయూ అతనికి తెలియదు. అడవిమనుష్యులు చదువుట వ్రాయుట అనువిద్యను మొట్టమొదట చూచినపుడు ఆశ్చర్యపడి ఉండవచ్చును. అయితే ఇప్పుడు అదే మనుష్యులు అనేకులు చదువుట, వ్రాయుట తెలిసియున్నారు. తమ అభిప్రాయమును వ్రాత ద్వారా మరియొకరి తెలియజేయగలవారైనారు. మరియొకరు రచించిన శాస్త్రమును పఠించి జ్ఞానమును సంపాదేంచుకొనుచున్నారు కదా ? ఇలాగే ఋషులు చెప్పుచున్న ఈ వేదాంతవిజ్ఞానమును ప్రయత్నించినట్లయితే మనముకూడా ,సంపాదించుకొనవచ్చునని నమ్మవచ్చును. మనయందున్న ఈ అతీంద్రియశక్తిని వేదము చూపించినతో మనముకూడా ఎందుకు తెలుసుకొనకూడదు ?

వేదాంతమునకు శ్రుతి, స్మృతి, పురాణములను మూడువిధముల గ్రంథములు మూలస్థానములయి యున్నవి. శ్రద్ధగలవారికి ఇవి లాభదాయకమగును. వ్యవహారమందు బావి త్రవ్వి నీటిని పొందుటకు, బీజమును వేసి పైరును పొందుటకు ఏవిధముగా శ్రద్ధ కావలయునో, ఆవిధముగానే ఇక్కడ కూడా శ్రద్ధగల వారికి జ్ఞానము దక్కును. ఈ విజ్ఞానము నిజముగా మనవంటివారికి అవశ్యముగా దొరకునను చెప్పు శాస్త్రాచార్యున యందు శ్రద్ధ గలవారికే ఇది ఫలపర్యంతమగును.

ఈ జ్ఞానము లభించుటకు మనుష్యత్వమొకటే చాలదు 'నావిరతో దుశ్చరితాన్నశాన్తో నా సమాహితః! న శాంత మనసోవాపి ప్రజ్ఞానేనైన మాప్నుయాత్' (క్ర.1.2.24) అను శ్రుతి చెప్పినట్లు చెడ్డఅలవాట్లను వదిలి యుండవలయును. ఇంద్రియ దౌర్బల్యమును పోగొట్టుకొనవలయును. మనస్సుయొక్క విక్షేపమును తొలగించుకొనవలయును. దీనికి వట్టి తర్కప్రధానమైన బుద్ధియే సాధనమని తెలుసుకొనకూడదు. ఆస్తిక్య బుద్ధి ఉండవలయును. భగవంతుడు గీతోపదేశమును ఎవరికి చేయకూడదో ఈ క్రింది విధముగా చెప్పినాడు. 'దీనిని తపస్వి కాని వానికి, ఈశ్వరభక్తి లేనివానికి, శుశ్రూషను చేయనివానికి, భగవంతునియందు అసూయ గలవానికి చెప్పరాదు (గీ. 18-27) ప్రశ్నోపనిషత్తునందు ఆర్గురు శిష్యులు పిప్పలాదుని దగ్గరకు వచ్చి బ్రహ్మచర్యంతో చాలాకాలమున్న తర్వాత, వారి ప్రశ్నలకు గురువు చెప్పిన సమాధానము మనసుకు నాటినది. " అవిద్యనుండి మమ్ములను తరింపచేసిన వారగుటవల్ల మీరు మాకు తండ్రి" అని అనినారని అక్కడ చెప్పిఉ న్నది. ఇట్లు శ్రద్ధాభక్తులతో ఉపదేశమును శ్రవణముచేసి జ్ఞానమును పొంది గురుపుత్రులు కావలయునను తహతహ ఎవరికి ఉండునో వారికే ఈ వేదాంతవిజ్ఞానము దొరుకును. భూమి యందు లోతుననున్న నీటిని పొందుటకు ఏవిధముగా బావిని త్రవ్వుట అత్యవసరమో అలాగే ప్రత్యగాత్మను కనుగొనవలయుననువాడు ఇంద్రియములను వెనుకకు త్రిప్పికొని వాటిని ఏకముఖముగా చేసికొనుట అత్యవశ్యము. శ్రోత్రియుడు బ్రహ్మనిష్ఠుడు అయిన సద్గురువును చేరి శ్రాద్ధాభక్తులతో శ్రవణముచేయు యోగ్యుడయిన శిష్యునికే ఈ జ్ఞానము లభించును.

పై చెప్పిన యోగ్యత లేనివారెవ్వరికినీ వేదాంతజ్ఞానము దొరకదు. వేదాంతము నకు శ్రద్ధాభక్తులెందుకు ? తెలుసుకొన శక్తి ఉండిన చాలదా ? అని కొందరు అడిగెదరు. వారికి నిజము తెలియదు. శ్రీ కృష్ణుడు "ఎవరికి ఈ ఆత్మజ్ఞాన రూపమైన నివృత్తి శ్రద్ధ లేదో వారికి భగవత్ప్రాప్తి కలుగదు. వారు సంసారమందే ఎప్పుడూ ఉందురు" (గీ. 9-3) అనినారు. శ్రీ శంకరాచార్యులు ఈ వాక్యముయొక్క అర్థమును

వివరించు నప్పుడు భగవత్ప్రాప్తియొక్క మాట అట్లుండనిమ్ము. దానికి మార్గమైన భగవద్భక్తియూ వారికి దొరకదు అనినారు. అందుచేత మనము బుద్ధిమంతులమను గర్వమును విడచి జ్ఞానసాధనములను మొదట అలవరుకొనవలయును. అటువంటి వారికి సద్గురువు యొక్క ఉపదేశముతో ఈ వేదాంతజ్ఞానము కొంతకాలమునకు దొరుకును.

# 2. ప్రాచీన వేదాంత ప్రస్థానములు

వేదాంత విషయములో మనకున్న తప్పుడు భావనలను మొదట పెరికివేయ వలయును. ఆత్మజ్ఞానమును తర్కప్రధానమైన బాహ్యాబుద్ధితో పొందుటకు వీలులేదు. అది సంస్కృతమైన మనస్సు కలవారికి మాత్రమే అనుభవముతో పొందవలసినది అని ఉపనిషత్తునందు చెప్పినదానినే ఆచార్యులు నొక్కిచెప్పినారను దానిని మరువకూడదు.

శ్రీ శంకరభగవత్పాదులవారు బోధించు వేదాంతసిద్ధాంత విషయములో ఏవిధముగా మనకు అనేకులు విపరీతకల్పనలు కల్గిఉన్నామో అలాగే జీవిత చరిత్ర విషయములో మరియు వారుచేసిన లోకోపకారవిషయములలో కూడా అనేక తప్పు కల్పనలు మనయందు ప్రచలితమయి యున్నవి. వాటిని మొదట మనము తొలగించుకొనవలయును.

శ్రీ శంకరాచార్యులు బౌద్ధమత ప్రచారమును అణిచివేసి జనులను వైదిక మార్గమునకు త్రిప్పినారనునదొకటి, వారివిషయములో అనేకులయందున్న భావన. అయితే నిజము కాదు. ఎందుకంటే ఈ ఆచార్యులకు ముందే ప్రసిద్ధమైన మాండూక్య కారికలను వ్రాసిన శ్రీ గౌడపాదాచార్యులుకూడా బౌద్ధమతఖండనకు అంత ప్రాశస్త్యమును ఇయ్యలేదు. వారు వేదాంతసిద్ధాంతముయొక్క విషయముతోనున్న తప్పుడు అభిప్రాయాలను ప్రధానముగా పరిహరించుటకు ప్రయత్నించినారు. బౌద్ధుల అభిప్రాయములే ఈ వేదాంతసంప్రదాయమందునూ

ఉన్నవి అను తప్పుకల్పనను మాత్రము వారు తీసివేసినారు. ఇక ఆచార్యునవారు తాము అనుసరించు శుద్ధ వేదాంత ప్రక్రియను అనుసరించని అద్వైతుల అభిప్రాయమును ముఖ్యముగా నిరాకరించిరి. వారు ఉపనిషత్తులకు భాష్యమును వ్రాయునప్పుడు 'అల్పగ్రంథావృత్తిరారభ్యతే ' సంక్షేపముగా అభిప్రాయమును చూపించు వ్యాఖ్యను వ్రాయుచున్నాను అనియే చాలా వరకు వ్రాసినారు. దానిని చూపించినట్లయితే వారి వెనుకకూడా, కొందరు విస్తారముగా భాష్యములనువ్రాసిననూ అవి సరియైనప్రక్రియను అనుసరించలేదనుదానిని సూచించును - అని మనము ఊహించవచ్చు. తమ భాష్యములందు బౌద్ధుల అభిప్రాయములనే ముఖ్యముగా ఖండనకుతీసుకొనినారు. వారి లక్ష్యమందున్న ద్వైతులనగా ముఖ్యముగా సాంఖ్యులు, వైశేషకులు, బౌద్ధులు, జైనులు. వీరి సిద్ధాంతములను అత్యల్పభాగమందు మాత్రమే నిరాకరించినారు. గీతాభాష్యమందు ఈ స్పష్టోక్తి ఉన్నది. " తదిదం గీతాశాస్త్రం ....... వివరణం కరిష్యామి॥" ఈ గీతాశాస్త్రము సమస్త వేదార్ధసార సంగ్రహమై యున్నది. దీని అర్ధమును తెలుసుకొనుట కష్టము. దానిని బయట పెట్టుటకు గాను అనేకులు పదపదార్ధము, వాక్యార్థము-వీటిని యుక్తి సహితముగా వివరించుచున్నప్పటికీ లోకమందు జనులు అత్యంత విరుద్ధమైన అనేకార్థములను గీతార్థమని గ్రహించుచున్నారని చూచి దాని అర్థమును వివేకపూర్వకముగా గుర్తించుటకుగాను సంక్షేపముగా వివరణను చేయుచున్నాను అని వ్రాసినారు. దీనివల్ల కూడా వారు వేరువేరు భాష్యములనే లక్ష్యమందుంచుకొని తమ భాష్యమును వ్రాసినారనునది స్పష్టమగును.

ఇప్పటి రామానుజ, మధ్వాచార్యున, వల్ల భాచార్యుల సిద్ధాంతమును ఆచార్యులు తమ భాష్యములందు ఎక్కడనూ పరామర్శించలేదు - అనుదానిని ఈ సందర్భమందు మనము చక్కగా తెలుసుకొనవలసియున్నది. ఆచార్యులు ముఖ్యముగా కటాక్షించిన ద్వైతులనగా ఆపై చెప్పినట్లు సాంఖ్యవై శేషికాదులే అను దానిని మనము మరువకూడదు. ఈ విధముగా ఉండుటవల్ల ఆచార్యులు 'అద్వైత స్థాపనాచార్యులు ' అని వర్ణించుట సరికాదని చెప్పవలసియున్నది.

ఎందుకనగా ఆచార్యులు అద్వైతమునేమో క్రొత్తగా స్థాపించలేదు. వారికి పూర్వమే చాలామంది ఉపనిషత్తులయందు అద్వైతమునేమో క్రొత్తగా స్థాపించలేదు. వారికి పూర్వమే చాలామంది ఉపనిషత్తులయందు అద్వైతమునే చెప్పినారని తమ భాష్యములయందు స్పష్టపరచినారు. శ్రీ శంకరభగవత్పాదులు చెసిన పని ఏమిటనగా ఆ అసాంప్రదాయక మైన అద్వైతమతములను ఖడించి పరిశు ద్ధమైన అద్వైతప్రక్రియప్రకారం వేదాంత సిద్ధాంతమును ఉజ్జీవము చేసి పునః ప్రతిష్ట చేసినవారైనారు.

ఇంకనూ కొందరు ఆచార్యులు 'షణ్మత స్థాపనాచార్యులు' అను కల్పనను వ్యాపింపజేసినారు. అయితే శంకరభగవత్పాదులు భాష్యమందు శైవ వైష్ణవము, శాక్తేయము, గాణాపత్యము - మొదలగు మతముల విచారముగాని, వాటి అనుయాయల ఆచారవ్యవహారములుగాని ఎక్కడనూ పరామర్శించలేదు.

ఇప్పుడు మరియొక కల్పనను మనము విచారించవలసినది మిగిలియున్నది. ఇంతవరకు వేముచెప్పినట్లు ఆచార్యులు తమ సమకాలమందునూ తమకు ముందున ప్రచారమందున్న అద్వైత ప్రస్థానములనేకమును సుస్పష్టముగా ఖండించినప్పటికీ వాటి యందే ఏదో ఒక మతమును తీసుకొని ఇప్పటి అనేక వ్యాఖ్యానకారులు 'ఇదే శంకరమతమని' వ్రాసినారు. వారి అభిప్రాయములనే ఇప్పటి కొందరుపండితులు ఎత్తి చూపించుచు 'ఇదే శంకరుల ఉపదేశములు' అనుచున్నారు. ఆచార్యుల సాక్షాచ్ఛిష్యులైన సురేశ్వరాచార్యులవారు తమ నైష్కర్మ్యసిద్ధి. తైత్తరీయ వార్తికము - వీటియందు పూర్వపు అనేక అద్వైతప్రస్థానములను ఖండించుట కనబడుచున్నది. ఇలాగుండుటచేత అద్వైతులయిన వారందరూ శంకరసాంప్రదాయ మునగల సిద్ధాంతమునే అనుసరించుచున్నారను ఖచ్చితమేమియూ లేదని స్పష్టమగును. ఇలా ఉన్ననూ ఇప్పుడు ప్రచారమందున్న వ్యాఖ్యాన ప్రస్థానములు, ఇంకనూ కొన్ని స్వతంత్ర కల్పనలు అద్వైతమునే ఒప్పుకొనినవే అయిన కారణముచేత అవన్నియూ శంకర సిద్దాంతమునకు అనుగుణమయినవే అని చెప్పుట ఎంత గొప్ప తప్పుకల్పన

అనుదానిని ఎవరైననూ ఊహించవచ్చు. నేను వెనుక ఒకగ్రంథమందు వ్రాసినట్లు ఆచార్యులు పూర్వమే ఖండించిన అనేక ప్రస్థానములు ఇప్పుడుకూడా కాలనేమి వలెనే రూపాంతరమును పొంది ప్రచారమందు వచ్చినవి. స్వతంత్ర ప్రజ్ఞలేనిజిజ్ఞానులు అనేకులు అవికూడా ఆచార్యుల ప్రస్థానములే అని మోసపోవు అకారణముచేత ఖండన కాబడి వదలబడిన కొన్ని ప్రస్థానములు ఇక్కడ ఉదాహరణకుగాను తెలిపెదము.

1. ప్రాచీన వేదాంత ప్రస్థానములయందు దేనిని ఒప్పుకొనని కర్మ మీమాంసకులయందు కొందరు కర్మవల్ల లభించు స్వర్గము ఆనందం రూపమగుట చేత దానికంటే వేరైన మోక్షము లేదు. జ్ఞానకాండయందు వచ్చు విచారములన్నిటిని అర్థవాదమని తెలియవలయును అనగా వేదవిహితమైన కర్మను పొగడూటకు వచ్చినవి' - అని చెప్పుచుండిరి.

2. ఈ వీరకర్మవాదులను వదిలితే కర్మ ద్వారానే వేదాంతులు చెప్పు మోక్షము లభించవచ్చునదిగా యున్నది అని వాదించు మీమాంతసులు రెండవ పక్షవాదులు. వారు చెప్పున దేమనగా : కామ్యకర్మతో శుభ ఫలము, నిషిద్ధకర్మవల్ల అశుభఫలము కలుగుటచేత ఆ రెండింటిని వదలి నిత్యకర్మ నొక్కదానినే చేయవలయును. కర్మ వదులుటచేత వచ్చునటువంటి ప్రత్యవాయము (ధోషము) దీని ద్వారా తప్పిపోవును. ఇప్పటి దేహము పడిపోయినతర్వాత మరియొక శరీరము ప్రాప్తియగుటకు కారణమే లేకపోవుటచేత మరియే ప్రయత్నము లేకుండగనే సులభముగానే ఆత్మస్వరూపమందు నిలచుటయను మోక్షము లభించును.

3. కర్మ, జ్ఞానము - ఈ రెండునూ వేదోక్తమే అగుటచేత ఈ రెండింటికి సరియైన విలువనిచ్చుట యుక్తమై యున్నది. అందుచేత జ్ఞానకర్మల రెండింటిని చేరుకొని చేయు అనుష్ఠానమువల్ల మోక్షము దొరుకును - అను పక్షమును ముందుకు తెచ్చిన వారు సముచ్చయవాదులు, వారి పక్షమందు జ్ఞానమనగా ఉపాసన లేక తత్త్వజ్ఞానము - ఈ రెండిటిలో ఏది అనునది స్పష్టముగా లేదు. కర్మ, జ్ఞానము వీటిలో ఏది ముఖ్యము, ఏది దేని అంగమైనయున్నది - అనునది

సుస్పష్టముగా లేదు. చాలామట్టుకు జ్ఞానమనగా ఉపాసన అనువారే ఎక్కువగా ఉన్నారని కనబడుతున్నది. ఎలా అయినాగానీస మోక్షము జ్ఞానకర్మల అనుష్ఠానమను సాధనముతో కలుగవలసిన కార్యమగుటచేతను, పుట్టుకగల పదార్థములన్నిటికీ నాశము ఉండేయుండవలయుననుటచేతనూ మోక్షము అనిత్యము కావలసియుండును. అనుదోషమును కర్మవాదులందరిమీదనూ ఆచార్యులు అపాదించుదురు. ఇప్పుడు వట్టితకర్మతోగాని, కర్మజ్ఞానముల సముచ్చయముతోగాని మోక్షముకలుగునని వాదించి అద్వైతవేదాంతులు లేరు. ఇప్పుడు ప్రచారమందున్న ద్వైత, విశిష్ఠాద్వైతములు మొదలగు క్రొత్తవేదాంత ప్రస్థానములయందునూ సముచ్చయువాదము కనబడుచుండుటచేత వాటివిమర్శను ఇక్కడ మనము వేరుగా చేయవలసినదిగా లేదు.

4. ఉపాసనతోనే మోక్షప్రాప్తి, ఉపాసనకంటే వేరైన జ్ఞానమే లేదు - అనువాదలు నాల్గవపక్ష వేదాంతులు : ఉపాసనతో అవిద్యయొక్క నివృత్తి కలుగుతుందని వీరియందు కొందరు చెప్పుదురు, 'దేవో భూత్వా దేవానప్యేతి' దేవతయే అయి దేవతల సాయుజ్యమును పొందును. అను శ్రుతిఉండుటచేత ఉపాసకుడు దేవ,యే తానని సాక్షాత్కారమును ఇక్కడేపొందిఉంటే దేహపాతానంతరము దేవతాసాయుజ్యమునే పొందును అనునది ఉపాసకులనమ్మిక. ఈ విషయమందు ఆచార్యులకు_భేదములేకకపోయిననూ మానసకర్మరూపమయిన ఉపాసనతో ఆత్యంతికముగా నిత్యమైన, మోక్షఫలము దొరకుననునది యుక్తి విరుద్ధమని వారి వాదము. ఉపాసనతోకలుగునది అదృష్టఫలమగుటతేత 'అత్ర బ్రహ్మ సమశ్నుతే ' (ఇక్కడే బ్రహ్మను చేరును) అనుశ్రుతికి చెప్పునటువంటి దృష్టఫలము దీనితో ఎలా దొరుకును ? అను శంకకు పరిహారము ఆ మతమందు లేదు. ఇంకనూ ఉపాసలతోనే అవిద్యయొక్క నాశముకలుగుతుందను వారివాదము యుక్త్యనుభవములకు విరుద్ధ మయియున్నది. త్రాడును పామని తెలియు అవిద్య 'ఇది త్రాడు' అను భావనామాత్రముతో తొలగుననుదానిని ఎవరుగాని ఒప్పుకొందురు?

5. బ్రహ్మ నిష్ప్రపంచమయియుండుటవలన ప్రపంచమంతటిని ఉపాసనతో లయించుకొనినట్లయితే మోక్షముకలుగుననుచెప్పుఉపాసనవాదులు అయిదోవ పక్షము. ప్రపంచము సత్యమయినట్లయితే దానిని లయింపజేయుట ఎవరివల్లనూ కాదు. అది వట్టి మిధ్యాభాసమే అయితే అవిద్యవల్ల వచ్చు ఆ తోపిక తత్త్వజ్ఞానమువల్ల కాక మరి దేనితోనూ ఎప్పుడూనూ పోదు - అను యుక్తితో ఈ మతమును ఆచార్యులు సూత్రభాష్యమందు ఖండించినారు. ఈ మతము అద్వైతులలో కొందరియందు ఇప్పుడూనూ రూపాంతరముతో మిగిలిఉన్నది. 'లయ చింతన' అను సాధనవిశేషముతో మోక్షము దొరుకునను నమ్మిక ఇప్పుడుకూడా చాలామందిలో స్థిరముగా నున్నది, శంకరుల రచన అని అత్యంత ప్రసిద్ధి అయిన వివేక చూడామణియందు ---

"అకృత్వా దృశ్యనిలయమజ్ఞాత్వా తత్త్వమాత్మనః ... " (63వ శ్లో) (భావార్థం) దృశ్యప్రపంచముయొక్క విలయమునుచేయక, ఆత్మతత్త్వమును తెలిసికొనక ఉచ్ఛారణ మాత్రమే ఫలమైన, బయటిశబ్దములతో జనులకు ముక్తి ఎట్లు వచ్చును?

'అకృత్వా శత్రుసంహార .... భవిత మర్హ తి' (64వ శ్లో॥)

(భావార్థము) : శత్రువులను పరిహారమునుచేయక అఖిలభూమండలము యొక్క సంపాదనపొందినను 'నేను రాజును' అను వట్టిమాటలతోనే రాజు కాగలడా?

'ఆపోక్తిం తత్త్వంసదుర్యుక్తి భిః' (65 శ్లో॥)

(భావార్థం) :- ఆప్తులు చెప్పినమాట, త్రవ్వుట, పైనుంచిన రాయి మొదలగు వాటుని ఎత్తివేయుట, నిధినితీసికొనుట - ఇంత చేయవలయునుకదా, వట్టి దుర్యుక్తులతో నిక్షేపము బయటకురాదు.

ఈ శ్లోకము యొక్క అభిప్రాయమును నెమరు వేసినచో వట్టి శ్రవణముతోగాని, మననముతోగాని తత్త్వప్రాప్తి కలుగదు, లయచింతస మొదలగు ఉపాయములతోనే అది లభించును - అని స్పష్టముగా కనబడుచున్నది. ఇది నిజముగా శంకరులరచన తాదనియు శంకరానంగులరచనయే అనియు నిర్ణయించి మేము ఒకగ్రంథమును

వ్రాసియున్నాము. అది అట్లుండనిమ్ము, శంకరాచార్యులు తాము ఖండించిన వాదమును తామే పురస్కరించి ఇంతబలముగా సాధించినారని ఎవరుగాని ఒప్పుకొందురు?

6. ఇంకనూ వాక్యశ్రవణముతో నేరుగా ఆత్మజ్ఞానము కలుగకపోయిననూ ఆ జ్ఞానమునే ఆవృత్తిచేయుటచేత సాక్షాత్కారముకలుగునని వాదించుచున్న ప్రాచీన వేదాంతులు కొందరుండిరి.శ్రవణమాత్రముచేతనే ఉత్తమాధికారులకు ఆత్మానుభవము కలిగిపోవును. ఆవిధముగా అనుభవమయినతర్వాత మరిచేయతగినది ఏమియూ మిగిలియుండదు - అను సాంప్రదాయపక్షమువారైన శంకరులమతములకు ఇది విరుద్ధమైయున్నది. అయిననూ ఈ పక్షమునకు భాష్యవ్యాఖ్యానములైన పంచపాదిక, భామతి ఈ రెండునూ బలమునిచ్చుచున్నలి. ఇప్పుడుకూడా ఈ అభిప్రాయము ఆచార్యులకు సమ్మతమని నమ్ము వేదాంతులు అనేకులున్నారు.

7. వట్టి వాక్యశ్రవణముతోగాని, వాక్యజన్యజ్ఞానముతోగాని అనుభవము రాజాలదు. వాక్యజన్య జ్ఞానమును మరియు దానికి అనుగుణమైన యుక్తిని అభ్యాసము చేసినట్లయితే సాక్షాత్కారము కలుగును - అనుపక్షముయొక్క ప్రాచీనవేదాంతులు మరికొందురు. ఈ పక్షమును సూత్రభాష్యము ఖండనచేసినది. వాక్యశ్రవణముయొక్క, యుక్తి యొక్క ఆవృత్తి అనగా ఆత్మయందు అధ్యారోపితమైన అనాత్మాంశమును తీసివేయు అభ్యాసమనునది ఆచార్యులపక్షము.

8. వాక్యజ్ఞానము సంసృష్టార్థమును చెప్పుచున్నది. ప్రతిపదముయొక్క అర్థమునకు మరియొక పదముయొక్క అర్థసంబంధము కలుగును. అందుచేత వట్టి వాక్యార్థము సంసృష్టార్థమునే చెప్పును. ఆ వాక్య జన్యజ్ఞానముయొక్క అభ్యాసముతో అసంసృష్టార్థ జ్ఞానమొకటి క్రొత్తగా పుట్టవలసియుండును, అనివాదించుపక్షము యొక్క వేదాంతులు ఇంకొక తెగ గలరు. అనుభవముతో కనుగొనవలసిన అఖండార్థమును వాక్యము బోధించును - అనువాదులు ఇప్పుడుకూడా ఉన్నారు.

9. వాసనానిరోధవాదులు అనువారు మరియొకపక్షపు వేదాంతులు. ఆత్మ అవస్థాత్రయమునకు సాక్షిగా ఉన్నాడుకదా ? అనస్థలు ఒకటి తర్వాత ఒకటి వచ్చిపోతూ ఉండుటచేత అవి మిధ్య. దానికి సాక్షిగా ఉన్నవాడిని నేను - అను జ్ఞానము కలుగునట్లు అవస్థావాసనయొక్క నిరోధమును చేసికొనవలయునని శాస్త్రము విధించినది, అనునది ఈ వాదుస అభిప్రాయము. అవస్థలు మిధ్య అనునది నిజమైననూ అవి నిజమే అను వాసనను తీసివేయుటకు వాసనా నిరోధమును విధించినది అను వాదమునకు ఆచార్యుల సంప్రదాయము వారి సమ్మతి యుండదు. ఇప్పుడుకూడావాసనా క్షయము మోక్షసాధనమును చెప్పు వాదులున్నారు. "వాసనాతానవం రామ ముక్తి రిత్యభి ధీయతే " అను యోగ వానిష్ఠ వాక్యమును ప్రమాణముగా పెట్టుకొని తత్త్వమును భోధించు వివేక చూడామణి మొదలగు ప్రకరణములను ప్రమాణమని నమ్ము వాసనాక్షయవాదులు చాలామంది ఉన్నారు. శ్రవణాది సాధనములతోనే అవగతి (అనుభవరూపమైన తత్త్వ జ్ఞానము కలిగి వాసనయూ ఆమాత్రముతోనే పోవలసినదిగానున్నది. అను ఆచార్యుల వారి ఉపదేశమునకు ఇది విరుద్ధముగా నున్నది.

10. వాక్యశ్రవణము చేతనే మోక్షము కాకపోవుటచేత - పాతంజలదర్శన మందు చెప్పినట్లు చిత్తవృత్తిని నిరోధము చేసికొనవలయును. అను పక్షమున కొందరు వేదాంతులున్నారు. ఈ వాదుల పక్షమును బృహదారణ్యకభాష్యమునందు ఖండించినది, ఇప్పుడూకూడా 'వట్టి వేదాంతవాక్యవిచారముగాని, మననముగాని చాలదు. నిర్వికల్పక సమాధిని సంపాదించుకొనవలసినదిగా ఉండుట అత్యవశ్యము', అను వాదులున్నారు. ఈ వాదమునతు వివేకచూడామణి యొక్క బలమున్నది.

తత్త్వసాక్షాత్కారవాదమనునదే ఆచార్యుల సంప్రదాయము యొక్క వేదాంత సద్ధాంతమునకు విరుద్ధముయి ఉన్నది. ఎందుకనగా సాక్షాత్కారమనగా దేశ, కాలనిమిత్తములు - వీటితో వ్యవహితమై ఉన్న పరోక్షవస్తువును ఆ వ్యవధానమును అతిక్రమించి నేరుగా చూచుట. అయితే ఆత్మ దేశకాలనిమిత్తములకుకూడా

సాక్షియై ఉన్నాడు. ఆయన దేనిచేతనూ నిజముగా పరిచిచ్ఛన్నుడుకాడు అనునది అనుభవానుసారమైన యుక్తియై యున్నది. మనందరి స్వభామే అయిఉన్న ఆత్మ మనకు వ్యవహితముగా ఉన్నదనునది ఎప్పుడూకూడా యుక్త్యనుభవములకు సమ్మతము కాదు - అను దానిని మళ్ళీ చెప్పవలసినది లేదు.

11. వట్టి సాక్షాత్కారమయితే చాలదు. ఆత్మ ఇప్పుడు దేహపరిచ్ఛిన్నుడై ఉండుటచేత దేహపాతమైన తర్వాతనే విదేహముక్తి కలుగుతుంది. అను వాదించు వారింకొక తెగ యున్నారు. జీవన్ముక్తి గౌణమనియు, విదేహముక్తియే ముఖ్యముక్తి యనియూ, చెప్పు వాదులు ఇప్పుడుకూడా ఉన్నారు. జీవన్ముక్తి లేక సద్యోముక్తి - అనునది ముఖ్యముక్తి అనియూ సశీసత్వమనునది మిద్యాభిమానమాత్రమనియు శ్రుతి యుక్క్యనుభవములకుపొందించి చూపించిన ఆచార్యులమతమునకు ఇది విరుద్ధయి యన్నది. ఇప్పుడే మనకు సంసారదుఃఖము మిధ్యవలే మనసుకు వచ్చును అను ఆచార్యులమతమునకు ఇంతవరకుచెప్పిన మతములన్నియు విరుద్ధమే అయి యున్నవి అనునది స్పష్టము.

ఆచార్యులు బోధించు వేదాంతము 'ఉన్నది పోదు, లేనిది రాదు' అనుతత్త్వము నవలంబించి యుండును. వారు శ్రుతికి, యుక్కికి, అనుభవమునకు పొందుగడ కలుగునట్లు దీనిని చూపించెదరు. అందుచేత మనము వాళ్ళువాళ్ళ చెప్పు చిల్లరవేదాంతము యొక్క మాటలకుగాని లేక శ్రుతివాక్యయుక్తిజాలములను మనముందు పెట్టి భయము కలిగించు వ్యాఖ్యానప్రస్థానములకు సమ్మోహపడక మొట్టమొదట శంకరభగవత్పాదులు తమ భాష్యమందు నిర్ణయము చేసియున్న వేదాంతమునే శ్రవణము చేయవలయును. ఆచార్యులు ఏప్రక్రియను అనుసరించి ఏవిధముగా తమమతమును అనుభవమునకు హత్తుకొనునట్లు చేసినారనుదానిని ఇకముందు చూపించుటకు ప్రయత్నించెదను.

## శంకర ప్రస్థానము మరియు ఇతర వేదాంత ప్రస్థానములు

శంకరులు అద్వైతస్థాపనాచార్యులు కారు. వారికి పూర్వమే వారి సంప్రదాయ ప్రస్థానము మిగతా ప్రస్థానముల జతలో ఉండేది. గౌడపాదాచార్యులు మాండూక్యోప

నిషత్తును వివరించునెపముతో సంప్రదాయప్రస్థానముయొక్క అసాదారణధర్మములను శ్రోతలకు స్పష్టముగా తెలియపరచినారు. ఆతర్వాత ఈ ప్రస్థానమునకు గొప్పవిలువ వచ్చినది. దీనిని ఉజ్వలముచేసి మిగతాప్రస్థానములతేజస్సును తగ్గించినవారు శ్రీశంకర భగవత్పాదులు. ఆచార్యులు ఈ ప్రస్థానస్వరూపమును ఏ విధముగా పుటము వేసిన బంగారమువలె కాంతియుక్తముగా చేసినారలు దానిని ఈ రోజున చూద్దాం.

(1) వెనుకటి వేదాంతప్రస్థానములు వేదప్రామాణ్యమునకు ముఖ్యముగా మీ మాంసకుల రీతినే అనుసరించి ప్రత్యక్షాదులకుఅందని తత్త్వమును వేదాంతము చూపించునని వాదించుచుండెడివి. ఇది ప్రత్యాక్షాదులకు గోచరమే కాకపోవుటచేత 'ఈ తత్త్వము నిజముగా ఉన్నదో లేదో ? అని ఎవరైన నాస్తికులు వాదించుటకు వారి ప్రస్థానములందు అవకాణముండెడిది. అట్లయితే వేదప్రామాణ్యము తప్పిపోవును అది బోధించు తత్త్వముయొక్క విషయమునందు ఏ సంశయము ఉండనట్లు పరమార్థమును శ్రోతలయందు ఉంచుట ఆచార్యుల ప్రస్థానసంప్రకాయము, బ్రహ్మ మనందరి ఆత్మేఅయి ఉండుటచేత దానిని శ్రుతియందు 'అత్ర బ్రహ్మ సమశ్నుతే ' అని చెప్పినట్లు ఇచటనే కనుగొనవలసినదిగానున్నది. ఈ ఆత్మ ప్రత్యక్షాదులకు గోచరము కాకపోయినప్పటికీ స్వయంసిద్ధముగా అనుభవస్వరూపమే అయిఉండుటచేత మేదైత ప్రమాణగోచరుడే అయిఉన్నాడనునదే ఈ ప్రస్థానము యొక్క అసాధారణ బోధ.

(2) అచార్యుడనగా వేదార్థమును వివరించి చూపించువాడు అను దానిని మీమాంసకులవలె వెనుకటి ప్రస్థానమువారు చెప్పుచుండిరి. ఇప్పటి వేదాంతులునూ ఈ విధముగానే చెప్పుచున్నారు 'అచినోత్యపి శాస్త్రాణి హ్యాచారే స్థాప యత్యపి। స్వయమాచరతే యాస్మాదాచార్యః పరికీర్త్యతే ' అన్నటుల శాస్త్రమువను వ్యాఖ్యాసముచేసి వివరించుట, జనుల ఆచారమందు వారిభోధను నిల్పుట, తానుకూడా ఆ విధముగానే ఆచరణయందు పెట్టుకొనుట - ఇవి ఆచార్యుని అసాధారణధర్మములే సరి. అయితే ఈ ప్రస్థానముయొక్క విశేషమేమిటనగా

వేదాంతము అనుష్ఠానమందు పెట్టుకొనవలసిన ధర్మమునుమాత్రమే చెప్పదు. ప్రపంచముయొక్క పరమార్థమైనపరమార్థతత్త్వమును బోధించి దానిని తెలియజేయుటే దాని విశేషము. ' ననరేణావరేణ ప్రోక్త ఏష, సువిజ్ఞేయో బహుధాతిన్త్య మానః అనన్యప్రోక్తే గతిరత్ర నాస్త్యణీయాన్ హ్యతర్క్యమణుప్రమాణాత్ ॥ (క. 1.2.8) అనినట్లు వేదాంతమందు చెప్పిన పరమాత్మతత్త్వమును సామాన్యజ్ఞానముగల గురువు ఉపదేశించినట్లయితే ఇది తెలియదు. ఉన్నదో లేదో కర్తో ఆకర్తో? అను మొదలగువివిధమైన వికల్పములకు అవకాశమిచ్చునటువంటి తత్వమిది. ఏ ఆచార్యుడు తానే ఈ తత్వమని అనుభవము కలిగి తీరును. మిగతావారు చెప్పినయెడల అణువుకంటే అణువుగా దుర్విజ్ఞేయముగా కనబడును. అందుచేతనే భగవంతుడు అర్జునినిగురించి ' ఉపదేక్ష్యన్తితే జ్ఞానం జ్ఞానినస్తత్వ దర్శినః ' వట్టిశాస్త్రజ్ఞానము మాత్రమే కాదు, తత్త్వమును నేరుగా అనుభవమందు కనుగొనిన జ్ఞానులే ఈ జ్ఞానమును సరిగా ఉపదేశించెదరు. వారు ఉపదేశించునదేమనగా ఇప్పటివలె నీకు మోహము మిగిలిఉండుటయే - ఉండదు అని బోధించెదరు. ఆచార్యులు అనుసరించు ప్రస్థానము యొక్క బోధ ఈ విధమైనది.

3. మిగతా ప్రస్థానములవారు తమతమ సంప్రదాయములు బోదించునటువంటి లక్ష్యమును అందుకొనుటకు అనుకూలించి కొన్నికొన్ని సాధన విశేషణములను బోధించుతూ ఉండిరి. ఆ సాధనములను అనుష్ఠానము చేసినట్లయితేనే వారుచెప్పుఫలము లభించును. ఆచార్యులు ఒప్పుకొనిన ప్రస్థానమందు వేదాంతవాక్యజన్యమైన జ్ఞానమే ముక్తికి ముఖ్యమైన సాధన: ఎందుకలగా పరమార్థతత్వము ముందే ఉండియుండునది. దానిని జ్ఞానముతో తెలిసికొనవలయునేదాని ఏదో ఒక సాధనముతో పొందవలసినది కాదు - అను ఆసాధారణబోధ ఇక్కడ ఉన్నది.

4. శంకరేతర సంప్రదాయముయొక్క ప్రస్థానములయందు జీవత్వ మనునది మనకు కలుగు బంధమై ఉన్నది. రోగము వచ్చినవారికి మందునిచ్చి

రోగపరిహారమును చేయవలసినట్లు, జీవులకు జీవత్వమను బంధమును పరిహారము చేయుటకు వేదోక్తమైన సాధనముల అనుష్టానములను చేయించవలయును - అనునది వేరువేరు ప్రస్థానముల మతము. అయితే శంకరప్రస్థానమందు ఈ విధముగా కాదు. జీవత్వము అవిద్యా కల్పితమయి ఉన్నది. త్రాడునందు కల్పితమైన పామును పోవునట్లు చేయుటకు ఏవిధముగా కఱ్ఱ అక్కరలేదో అలాగే ఈ అవిద్యాకల్పితజీవత్వమును తీసివేయుటకు ఏవిధమైన సాధనము అక్కరలేదో అలాగే ఈ అవిద్యాకల్పితజీవత్వమును తీసివేయుటకు ఏవిదమైనసాధనము అక్కరలేదు. సాధనము ఇక్కడ ఏ ఉపయోగమునకు రాదు. వేదాంతోపదిష్టమైన " నేను బ్రహ్మను " అను అనుభవరూపమైన జ్ఞానము విచ్చినట్లయితే నేను జీవుడను, నేను సంసారిని అను భ్రాంతి తొలగిపోవును. సాధనము జీవత్వమును తీసివేయుటకు కాదు జ్ఞానమును కలిగించుటకు.

5. అవిద్య, అజ్ఞానము - అంటే ఏమిటి? ఈ విషయములకు మిగిలిన ప్రస్థానములందు ఐక్యమత్యము లేదు. అజ్ఞానము శాస్త్రముతో తెలియవలసినదిగా ఉన్నది. ఇప్పుడు అవిద్యతొలగినచో శాస్త్రోక్తమైన సాధనమును చేయుట అవశ్యము. కొందరు వేదాంతుల మతమందు నైసర్గిమైన ఆత్మావిద్య ఒకటి, ఆగంతుకమైన అనాత్మావిద్య ఒకటి - ఈ విధముగా రెండు విధముల అవిద్యలున్నవి. ఆరంతుకమైన అనాత్మ.యొక్క విష.మందున్న అవిద్య - ఉదాహరణక: త్రాడు పామను జ్ఞానములకు కారణమైన అవిద్య ఇది త్రాడే అను నిశ్చయమువల్ల పామును భ్రాంతి తొలగునట్లు - తత్త్వజ్ఞానమమయిన వెంటనే ఎగిరిపోవును. అయితే అనాదిగా ఉన్న ఆత్మా విద్య ఇలాకాదు. తత్త్వజ్ఞానముతో అది పోయినతర్వాతకూడా వాసనతో మళ్ళీ రావచ్చును. అందుచేత జ్ఞానముకూడా మళ్ళీ వెనకడుగు వేయవచ్చును. అందుచేత మళ్ళీమళ్ళీ జ్ఞానభ్యాసమును చేయవలయును - అనివారు చెప్పుచుండిరి. వార్తికారులైన సురేశ్వరాచార్యులు అవిద్య రెండు విధములనగానేమి? విద్య దానిని తొలగించినతర్వాత మళ్ళీ అది ఉజ్జీవమగుట ఎట్లు కలుగును ? అని శంకరభగవత్పాదులు ప్రస్థానము

నవలంబించి ఆ వాదుల మతమును నిరాకరించినారు. ' పురుష ఏ వేదం విశ్వం కర్మ తపో బ్రహ్మ పరామృతం! ఏతద్యో వేద నిహితం గుహాయాం సో విద్యాగ్రంధిం వికిరతీహ సోప్య ॥ (ముం.2-1-10) కర్మ, జ్ఞానరూపమైన తపస్సు - ఇదంతయూ ఉత్కృష్టమైన అమృతస్వరూపమైన సర్వకారణమైన అక్షరమను పరబ్రహ్మమే, పరమపురుషుడే. ' ఈ పరబ్రహ్మ నేనే ' సర్వజీవుల హృదయందునూ వారివారి ఆత్మగా ఉన్నాను, అని ఎవడు అనుభవములకు తెచ్చుకొనునో అతడు ఇక్కడే బ్రతికి ఉండగనే అవిద్యా గ్రంథిని విప్పుకొనును. అవిద్యము సర్వవిధ వాసనాసహితముగా నాశము చేసుకొనును - అను శ్రుతిప్రమాణముతో ఆచార్యులు నిస్సంశయముగా ఆత్మజ్ఞానముతో కలుగు ఫలమును వర్ణించినారు.

(6) వాక్యార్ధ నిర్ణయము : పూర్వపు వేదాంతులయందు ఒక్కొక్కరు తమతమ ప్రస్థానమునకు తగిన సిద్ధాంతమును మీమాంసా నియమముల ననుసరించి ఉపక్రమోపసంహారములు మొదలైన ఆరువిథములైన తాత్పరయ లింగములు, శ్రుతి లింగము, స్థానము - మొదలగు శబ్ద ధర్మములు - వీటిని విచారము చేయుచు వేదాంతవాక్యముల అర్థమును నిర్ణయము చేయుచుండిరి. వారివారికి కావలసినట్లు వాక్యములను ఏరుకొనుట, బుద్ధికౌశలముతో వాక్యముయొక్క అర్థమును నిర్ణయించుట - ఇవి వారందరికి సమానమై ఉండుటచేత ఎవరి ప్రస్థానము ఎందుకు సర్వశ్రేష్ఠమను దానిని నిర్ణయించు గీటురాయే దొరకనట్లు అగును. అయితే ఆచార్యులు తమప్రస్థానము యొక్క సంప్రదాయముననుసరించి"ఇప్పుడు నేను చేసిన వ్యాఖ్యానముర్పకారం విషయం అనుభవమునకు వచ్చునో రాదో చూడండి" అని శ్రోతలకు ఆహ్వానమిచ్చిరిఎవరైనా సిద్ధాంతమునకు ఏ ఒక్క వాక్యమును ప్రమాణముగా ఉదహరించి వ్యాకరణము, కోశము - మొదలగు వాటి బలముతో తమకు ఇష్టమైన అర్థమును ఎలాదైననూ తీసుకొనవచ్చునదిగా ఉన్నది. అయితే వారు చెప్పు అర్థము కాలాంతరమునందు దేశాంతరమునందు ఫలము ఇచ్చునదిగా ఉంటే వారి వ్యాఖ్యానము సరియో కాదో - ఎట్లు నిర్ణయించలసయును ? ఈ చిక్కు ఆచార్యుల ప్రస్థానమందు లేదు.

'ఇదంతయు బ్రహ్మమే, 'నేను బ్రహ్మము' అనునది వాక్యర్థముయొక్క జ్ఞానముకలిగినవానికి ఇప్పుడే ఇక్కడే అనుభవమునకు వచ్చునను ఉపదేశము అనుభవానుసారమై యున్నది. దానిని ఎట్లు తీసివేయుటకు వీలగును ?

(7) పరమత ఖండన : ప్రతియొక్క ప్రస్థానము వారును తమతమ సిద్ధాంతమునకు అనుగుణముగా మీమాంసాన్యాయముననుసరించి వాక్యార్థమును ణిర్ణయించుటేకాక మిగతావారి మతములను ఈ మతము శ్రుతి స్మృతులకు విరుద్ధమైను అని చూపించుటకు బయలుదేరుట వారివారికి తోచిన యుక్తులతో పరవాదుల మతమును ఖండించుట, ఇది అన్నిప్రస్థానముల వారికి సమానమై ఉండెడికి. ఈ విధముగా  వాదించు వారిలో ఏ ప్రస్థానము శ్రుతియుక్తులకు సమ్మతము, ఏది విరుద్ధము ? అను దానిని గుర్తుపట్టుట సామాన్య ప్రజ్ఞ గలవారికి వీలుపడెడిది కాదు. అయితే ఆచార్యుల తమ ప్రస్థానమునకు ముడుపుహా తీసుకొనిన సార్వత్రికానుభవమును పెట్టుకొని శ్రుతియూ, దానికి అవిరుద్ధమైన తర్కమూ ఈ అనుభవమునకు సమ్మతముగానే ఉన్నాయి అనుదానిని చూపించినతర్వాత మిగతామతములకు ప్రాబల్యము లేనట్లగును.

వెనుక అనేకభాష్యకారులు తమతమ ప్రస్థానములపరముగా శ్రుతులకు వ్యాఖాయసమును చేసియుండిరి. అయితే వాటిలో ఏ ఒక్కటియూ ఇప్పుడు మిగలలేదు ఆచార్య శంకరులు వ్రాసిన భాష్యములు ఇప్పుడు మిగలలేదు ఆచార్య శంకరులు వ్రాసిన భాష్యములు ఇప్పుడుకూడా మిగిలి.స్త్రన్నవి, సర్వజన సామాన్యమై యున్నవి. ఈ ఆచార్యులపేరు ఇట్లు అఖిల భూమండలమందునూ ప్రఖ్యాతమయి ఉండుటచేత ఆచార్యుల రచన అంటే అది సర్వసామాన్యమగునని అనేక గ్రంధకర్తల నమ్మిక. అందుచేట 'శంకర భగవత్పాగుల విరచితము' అని తమ గ్రంథములకు సమాప్తి వాక్యమును వ్రాసికొనినారు. ఇది ఆచార్యులను కించపరచటమే కదా? ఈ ఆచార్యులు చూపించిన అనుభవము అన్నిదేశములకు, అన్నికాలములకు మాన్యమయి ఉండుటచేత అందరికీ మాన్యమై ఉన్నది. యజ్ఞాత్వాన పునర్మోహమేవం యాస్యసి పాండవ' దీనిని తెలుకొంటే మొదటివలె

నీ అజ్ఞానము ఇట్లు రాజాలదు. అని భగవంతుడు చెప్పినట్లు ఆచార్యులు చూపిన జ్ఞానమును అత్యంతికముగా తీసివేయును. ఇది ఈవిధముగా కాదు, అని ఏ ఒక్కరూ ఎక్కతనూ ఎప్పుడునూ ఒప్పు కొనపోవుటకు వీలులేదు.

ఈ జ్ఞానము సార్వత్రికానుభవమునకు సమ్మతమయినంత మాత్రమున దీని వలన జనుల జీవీతమునకు ఏమాత్రమయినా ప్రయోజన ముండునా ? - అని ఎవరైనను అడగవచ్చు. ఇక్కడ ఒక ప్రశ్న, జీవితముగానేమి ? నా పుత్రుడు ఎమ్.ఎ. పరీక్షలో మొదటి తరగతిలో ప్యాస్ కావలనని యున్నది. నీ వేదాంతముతో అతనికి ఏమయినా ప్రయోజనమున్నదా ? - అను ప్రశ్న ఈ జీవితమను శబ్దవ్యాఖ్యాన పరిధియందు చేరదు. ఎందుకనగా జీవితమునకు ఏదో ఒక పరిక్షయందు ఉత్తీర్ణుడు కావలయుననేమి లక్ష్యము కాదు. దానితోనే జీవితమునకు ఎక్కువ విలుప రావలసినదేమియూ లేదు. ప్యాస్ కాని, తప్పని - అందరికి మనఃశాంతి దొరికినట్లయితే అది జీవితమందు ప్రయోజనకరమని ఒప్పుకొనవలయును. అప్పుడే అది 'బ్రహ్మవిద్య' అన్నిటికంటే గొప్ప జ్ఞానము - అను గైరవమైన పేరుకు తగినదవుతుంది. ఏది సకన విద్యానిలయమేగాని, దానివల్ల ఏ పదవి పొందిననూ మనకు మనఃశాంతి దొరకకపోతే జీవితమందు ప్రయోజనము కల్గునని చెప్పవచ్చునా ? ఈ మనశ్శాంతి డబ్బుతో లభించునని నమ్మినట్లయితే అత్యంత హాస్యాదమగును. మనుష్యుడు మనశ్శాంతి ఇయ్యనటువంటి ఏ సాధనముతోనూ తన మర్త్యత్వమును దాటలేదు. 'నకర్మణాన ప్రజయా ధనేన త్యాగేనై కే అమృతత్వ మానశుః అను శ్రుతివాక్యమువలె మనము ఎటువంటి అద్భుత కర్మను చేసిననూ మనకు అమృతత్వము లభించదు. మనకు ఉత్తమ ప్రజాసంతతి కలిగి మన కులమునకంతయూ గొప్ప కీర్తి వచ్చినప్పటికీ మనకు అమృతత్వము దొరకదు. మనుష్యుడు తన మర్త్యత్వస్వభాము నుండి విడుదలయై అమృతత్వమును పొందవలయునంటే అనాత్మరాసి నంతటిని త్యాగముచేసి పరమార్థ సత్యమైన తన స్వరూపవిజ్ఞానమును పొంది దానియందే నిల్చొనినప్పుడే నిజమైన అమృతత్వము లభించును అప్పుడే అతనికి శాశ్వతమైన శాంతి దొరకును.

అతని జీవితము సార్థకమగును. జనక మహారాజువంటి చక్రవర్తికూడా ఈ వేదాంత విజ్ఞానమును ఇచ్చునటువంటి యాజ్ఞవల్క్య డంతబ్రాహ్మణుడు 'అభయంవై జనక ప్రాప్తోసీ ' అని అభయ దానమును ఇచ్చినాడు. ఈ అభయమును, ఈ అమృతత్వమును ఈ శాశ్వత శాంతిని జీవించియుండగనే ఇయ్యగల వేదాంతము యొక్క ఫలమును వద్దని ఎవరైనా అందురా ?

ఈ ఫలము జీవించి ఉన్నప్పుడే ఈ జ్ఞానమును సంపాదించుకొనిన మాత్రముతో అందరికి సమానముగా లభించునని శంకరభగవత్పాదులు చూపించినారు. ఈ ఉపనిషత్తులకు వీరివలె సంస్కృతమందే మిగిలినవారు భాష్యమును వ్రాసినప్పటికినీ తత్త్వము సర్వుల అనుభవమునకు సరిపోయినదని వీరివలె ఏ ఒక్కరునూ వెనుకచూపించలేదు. అందుచేత ఈ జగత్పూజ్యులైన మహామహులైన వారిని మనము నిత్యమూ స్మరిస్తూ వీరి అనుగ్రహముతో నిజమైన ముముక్షత్వము మనకు రావలయునని కోరుదాము. వీరిఅనుగ్రహముతో మనకు అవశ్యముగా కాలానుగుణముగా ఈ వేదాంతవిజ్ఞానమూ దీనివల్ల కలుగు అమృతత్వమూ అభయము, శాశ్వతమైన మనఃశాంతియూ లభించును నమ్మవచ్చునదిగా ఉన్నది.

# లౌకికజ్ఞానము

శంకరభగవత్పాదులు అనుసరించిన వేదాంతసాంప్రదాయమునకు మిగతా వేదాంతుల సంప్రదాయములకు ఉన్న పరస్పరవై లక్షణ్యమును సంక్షేపముగా చెప్పినట్లయినది. ఇప్పుడు వేదాంతమందు చెప్పిన జ్ఞానాజ్ఞానములగురించి విచారము చేయువలసియున్నది. అయితే దానికంటే మొదట లౌకిక జ్ఞానజ్ఞానములను విచారమునకు తీసుకొనుట అవశ్యము.

చిన్నబాబు పుట్టినప్పుడు వాడికి మొదట నాలుక పనిచేయును. వత్తిని నూనేలో నానవేసి ఈ పసివాడితో నాకించు పద్ధతి కొందరియందున్నట. ఆతర్వాత జిహ్వేంద్రి యముతోపాటు చక్షురింద్రియమూ పనిచేయును. వానికి ప్రకాశమును

చూచుటకు చాలా కుతూహలము. మొట్టమొదట వెలుగులో తల్లి ముఖమును చూచుచుండును. ఇంకనూ పెరుగుచూ వచ్చినప్పుడు మిగతా ఇంద్రియములు ఒకదాని వెనుక ఒకటి పనిచేయుటకు ఆరంభించును. మనము పెద్దవారమయిన తర్వాత ఇంద్రియములద్వారా బయటి ప్రపంచమును చూచి దానియొక్క విషయజ్ఞానమును సంపాదించుకొందుము. ఆ జ్ఞానము రాశీ అవుతూ వచ్చినదంతయూ ప్రపంచముయొక్క విషయమందు మనకున్న అజ్ఞానము - అంటే జ్ఞానముయొక్క అభావము లేనట్లు అగుచూపోవును. ఈ విధముగా జ్ఞానముతో పెరిగి అజ్ఞానము నాశమగుచున్ననూ ఇక్కడకు అజ్ఞానమంతయూ పోయినది - అను చివరి ఘట్టము చేరుకాలమే ఉండదు.

జ్ఞానము ఎక్కువయినప్పుడల్లా మనకు ఈ జ్ఞానము సరియో కాదో ? ఈపదార్థము నేను తెలిసికొనినట్లున్నదో లేదో ? అను సంశయము కలుగుట మొదలగును. పదార్థములు ఒకటివలె ఇంకొకటి ఉండుటవల్ల, లేక అతిసూక్ష్మమై ఉండుటచేత అతిదూరమందు లేక అతిసమీపమందుండుటచేత వాటి విషయములో విపరీతజ్ఞానము (తప్పుతెలివి) కలుగవచ్చు. అప్పుడు మన జ్ఞానమును శుద్ధముచేయుటకు తర్కమును ఉపయోగించ వలసి యుండును. దీనికి మనస్సు కూడా కావలయును.

జ్ఞానసంపాదనకు సామాన్యజనులు ఉపయోగించు ఇంద్రియముల సహాయమున కని భౌతికశాస్త్రజ్ఞులు దుర్భిణి (దూరదర్శకయంత్రము) సూక్ష్మదర్శకయంత్రము మొదలగువాటిని ఉపయోగించెదరు, వారు సూక్ష్మవస్తువులస్వరూపము - వీటిని కనిపెట్టుచునే ఉన్నారు. జ్ఞానము కల్గిన తర్వాత మనకు దృశ్యవస్తువులయందు కొన్ని ప్రియముగాను మరికొన్ని అప్రియముగాను కనబడుటచేత వాటివిషయమందు ఇచ్ఛయో, ద్వేషమో కలుగును. అప్పుడు కోరిక పెరుగుచున్నప్పుడల్లా ఇష్టమైన వస్తువుల సంపాదలకు ప్రవర్తించటయూ ద్వేషము కలిగినప్పుడూ అనిష్ట వస్తువులను దూరము చేసుకొనుటకు తపనపడుటయూ స్వభావముగా నున్నది. పిల్లలు పటికను

పంచదార అని భ్రమించి ఒకసారి తిన్నతర్వాత నిజమైన పంచదార వద్దనెదరు. అయితే వటికను పంచదారకు ఉన్న స్వరూపగుణాదుల విలక్షనత్వమును నిశ్చయించి తెలిసికొనిన తర్వాత ఈ రెండింటిని ఉపయోగించుట ఎలాగనుదానిని తెలిసి నడచుకొందురు. ఇలాగే ఇచ్ఛాద్వేషములు పెరిగినప్పుడల్లా గొప్పవారుకూడా దృశ్యవస్తుజ్ఞానమును ఎక్కువ చేసికొను ఆ విద్యాభ్యాసమువల్ల అజ్ఞానమును పోగొట్టుకొనుచూ  పోవుచున్నారు. భౌతిక శాస్త్రజ్ఞులు శక్తి శాస్త్రము, వస్తురచనా శాస్త్రము, వనస్పతి శాస్త్రము, ప్రాణిశాస్త్రము, మనుష్యుని శరీరేంద్రియములు, మనస్సు మొదలగు విచారముగల శాస్త్రము - వివిధమైన రాసులుగా పెట్టుకొనిన శాస్త్రములన్నియు ఈ విధముగానే జ్ఞానార్జన, ఇచ్ఛాద్వేషములతో ప్రవృత్తి నివృత్తులు, ఇష్టసంపాదనకు అనిష్టనివారణకు ఏర్పరచుకొను ఉపాయములను శోధించి కనిపెట్టుకొనుట - వీటి ఇతిహాసమే అగును:

మనదేశమందు వైశేషికులు బాహ్యదృశ్యములను ద్రవ్య, గుణ, కర్మ, సామాన్య, విశేష. సమవాయ, అభావములను ఏడు పదార్థములుగా విడదీసి విచారము చేయు ఒక దర్శమునే ఏర్పరుచుకొనినారు, నైయ్యాయికులు జ్ఞానప్రధానమైన ప్రమాణ ప్రమేయాదుల విచారముయొక్క దర్శనమొకదానిని ఏర్పరచినారు. భౌతిక విజ్ఞానులే గాని, దార్శనికులేగాని, బయటి జ్ఞేయపదార్థముల దృష్టితో సేకరించుకొనిఉన్న జ్ఞానురాశి హెచ్చినప్పుడల్లా జ్ఞానాభావము సంశయము, విపరీతజ్ఞానము (లేక మిధ్యాజ్ఞానము) - అను మూడువిధముల అజ్ఞానము తొలగుతూ ఉండిననూ అజ్ఞానము పూర్తిగా పోయిందను అవధిని గుర్తుపట్టుటకు వీలులేదు. భౌతిక విజ్ఞానముయొక్క చిట్టచివరి తీర్మాన వాక్యమేమి? అని అడిగినచో ఇదే 'చిట్టచివరి తీర్మానము ' అనుమాట వదలివేయుటయే సమాధానమని జేమ్స్‌జీన్స్ వ్రాసివాడు.

మొత్తముమీద లౌకిక విజ్ఞానముగా అజ్ఞానమును తీసివేయుట అనుటకంటే అజ్ఞానమును పెంచుకొనుట, ఇచ్ఛాద్వేషాదులకు పెంచుకొనుట, ఇష్టమైన పదార్థములను సంపాకించుకొనుటకు అయిష్టమైనవాటిని తొలగించుకొనుటకు

కావలసిన ఉపాయవిశేషణములను నిర్మించుకొనియుండుట - మొదలగునవి అనవచ్చును. ఇంద్రియములను బహిఃకరణములు, మనస్సును అంతఃకరణము వీటికి సహాయకముగా ఏర్పరచుకొనిన యంత్రాద్యుపకరణములు, ఈ సాధనములందున్న దోషములవల్ల మనకు కలుగు ప్రయోజనమేమి ? అనర్థమేమి ? - అను లాభనష్టముల పట్టికను తయారుచేసినట్లయితే ఈ ఉపనిషత్తు వాక్యములను గుర్తుకు తెచ్చుకొనినట్లగును.

' పరాంచి ఖాని వ్యతృణాత్ స్వయంమ్భూస్తస్మాత్ పరాఙ్పశ్యతి నాంతరాత్మన్ ।
పరాచః కామాననుయంతి బాలాస్తేమృత్యోర్యన్తివితతస్య పాశమ్॥' - కఠ2-1-1,2.

(1) మన ఇంద్రియములు బయటముఖముగా సృష్టింపబడుటచేత బయట వైపునకే మనము చూచుచున్నాము: మనలోపల ఏమిఉన్నది అనుదానిని తెలిసికొను ప్రయత్నమునకు అవకాశమే లేదు. (2) పిల్లలవలె అవివేకులయినవారు బయటి ఇష్టమైన వస్తువులనే వెంటాడుదురు. వారు అంతటా వ్యాపించికొనియున్న అవిద్యా కామ కర్మలనబడు మృత్యువుయొక్క వలలో పడుచున్నారు.

విషయముల జ్ఞానమును సంపాదించుకొనుటకు మనకు ప్రత్యక్షాది ప్రమాణములు సహాయపడుట నిడము: అయితే ప్రమాణములయందు దోషములుండుటచేత వాటివల్ల కల్గు జ్ఞానములను పరీక్షచేసియే ఉపయోగించుకొనవలసి యున్నది. ప్రమాణములను పరిశుద్ధి చేయుటకు మనకు తర్కము యొక్క సహాయముండుట నిజము. అయితే ఆ తర్కము సరియో, కాదో? - అనుదానిని తెలిసికొనుటయు అత్యవశ్యకమయి యున్నది. ఎందికనగా మనము అనుమాన ప్రమాణములతో విషయముల స్వభావమును నిశ్చయించుటకు ఉపయోగించుచున్న కారణములు దుష్టమై యుండవచ్చును. హేత్వాబాసలును పరిశీలించుచున్నప్పుడు మనస్సునందున్న ఇచ్ఛాద్వేషముల సంస్కారములు సంపూర్ణముగా మనయందు ఏ ఒక్కరికీ తొలగియుండవు. అందుచేత 'ప్రమాణములతో, తర్కముతో గుర్తుపట్టవలసిన జ్ఞానము నిశ్చితమై యున్నది. ఇంకనూ సంశయముగాని విపరీత జ్ఞానముగాని ఉండుటకు వీలులేదు, అని

గుండె చరచుకొని ఎవరును పొగడు కొనుటకు వీలులేదు. అందువల్ల ఈ జ్ఞానముల ఆధారముతో మనము అనుసరించుచున్న ప్రవృత్తినివృత్తులు సఫలమయ్యే తీరును. ఈ జ్ఞానములయందు ఏతప్పునూలేదు - అని చెప్పనక్కర్లేదనట్లయునది. " సర్వాన్ కుశాగ్రాణి తథోదపానం జ్ఞాత్వా మనుష్యాః పరి వర్జయన్ని। అజ్ఞానతస్త్రత్రపతన్తి కేచిత్జ్ఞానే ఫలం పశ్య యథా విశిష్టమ్॥' (ఇక్కడ పామున్నగి, ఇక్కడ ముల్లున్నది, ఇక్కడ బావి ఉన్నది' అని తెలిసికొనిన మనష్యులు వాటిని వదిలి ఇంకొకవైపు వెళ్లుదురు: అయితే వాటిని తెలియనివారు అక్కడికే పోయి పడుదురు, అను భరతవచనమును విన్నవారికి ఇప్పటి మన జ్ఞానమును ఎంతెంత పెంచుకొనిననూ అత్యంత అజ్ఞానము పెరుగుచుండుట వల్లనూ మళ్ళీమళ్ళీ తప్పుదారితో అనుసరించిన కర్మఫలముగా మనము అనర్థమును పొందుతునే ఉండవలసి యుండునుకదా! మనము పాములనుండి తప్పించుకొనిపోయి కొండచిలువ నోటిలో పడుచున్నామా ? ముళ్ళు గుచ్చుకొనునను భయముతో ఇంకొకమైపు వెళ్ళి గులకరాళ్ళీతో అరికాలులో గాయమును చేసుకొనుచున్నామా ? బావిలో పడిపోయెగమని తిరిగి తిరిగి ఊబిలో పడిపోవుచున్నామా ? అను సంశయము వచ్చుటకు అమకాశమున్నది.

ఇంద్రియములు వాటికి వెనుక సహాయముగానున్న మనస్సుతోసహా బయటనున్న జ్ఞేయవస్తువులనుమాత్రమే తెలియగలవు. అవి మనకు ఇచ్చిన జ్ఞానము ఎంత పెరుగునో అజ్ఞానము యొక్క బాధ అంత తప్పదు. మృత్యువు తెచ్చిపెట్టిన - అవిద్యా కామకర్మలను విశాలమైన వలలో మనము పడకుండా ఉండుటకు వీలగునట్లే తోచుటలేదు. అందుచేత ఈ రెండిటికంటే వేరైన జ్ఞానసాధనము వేరుగా ఏమైనా ఉన్నదా. వేదాంత విజ్ఞాన సునిశ్చితార్థా ః వేదాంత విజ్ఞానముతో నిస్సంశయముగా నిర్దుష్టమైన జ్ఞానమొకదానిని సంపాదించుకొనవచ్చునని చెప్పుట 'ప్రామిసరీ నోట్' అనువాగ్దాన పత్రమువలె కనబడునట్టి కాగితమా ? దానియందు నిజమైనతర్కమున్నదా ? దానిని మనము ఇంకనూ చూడవలసియున్నది. వేదాంతులు చెప్పుచున్న అమృతత్వసాధనము

ఏ నిర్దుష్టమైన ప్రమాణముతో గుర్తించనగును ? దానిద్వారా గుర్తించవలసిన అర్థము. సంశయ విపరీతజ్ఞానములు దోషముయొక్క స్పర్శలేకుండా నిరపవాదమైన జ్ఞానమును దానిని మనము ఏవిధముగా నిశ్చయించుకొనవచ్చును ? ఈ ప్రశ్నకు సమాధానమును కనుగొనుటకు ఇకముందు ప్రయత్నించుదాము.

# 5. అనుభవవిశేషములు

జ్ఞానమునకు ఇంద్రియములు, మనస్సు సాధనమై ఉన్నాయనియు వాటితో బయటి ప్రపంచమును మాత్రము కొంతవరకు తెలిసికొనవచ్చుననియూ ఇంతవరకు తెలిసికొని నట్లయినది. బయటి విషయములను తెలియుటకు ఇంద్రియములను సాధనమేగాక ఇంద్రియములతో నేరుగా చూచినదానిని సాధనముగా చేసుకొని దాని ఆధారముతో ఇంద్రియ గొచరముకాని కొన్ని పదార్థములను ఊహించియూ తెలుసుకొనవచ్చును, ఈవిధముగా జ్ఞానసాధనకు ఇంద్రియములనే ప్రధానముగా ఉపయోగించుకొనువారు ప్రమాణవాదులనిపించుకొందురు.

ఈ ప్రమాణములయందు ప్రత్యక్షమును మాత్రము ఒప్పుకొనినవారు మనదేశ మందు చార్వాకులనిపించుకొందురు. ఇంద్రియములతో మనము చూచినామని కల్పించు తొనినదంతయూ నిజముకాదు. మరుభూమియందు దూరముగా కనబడు ఎండమావుల నీరు నిజముగా నీరుకాదు. అక్కడ మనకు కల్గినది సరియైవ జ్ఞానము కాదు. అది వట్టి భ్రాంతి (మిధ్యాజ్ఞానము, విపరీతజ్ఞానము): ఆకాశము నీలవర్ణముగానున్నది అని, మనకు కనబడుటయూ భ్రాంతియే. శ్రీంధాంధకారములో పడియున్న త్రాడును పామునియు, సూర్యప్రకాశములో ధళధళయని మెరయుచున్న ముత్యపుచిప్పను వెండియను భ్రాంతి సుప్రసిద్ధమయినది. అందుచేతనే ఇంద్రియములవల్ల మనకు జ్ఞానము భ్రాంతియో, యాధార్థమో అని గుర్తుపట్టుటకు తర్కము కావలసియుండును అని అప్పుడే చేప్పినట్లయినది. ప్రత్యక్షముగా చూచి తర్కముద్వారా నిశ్చయించిన తర్వాత యదార్థజ్ఞానము కలుగును. ఇటువంటి ప్రత్యక్షజ్ఞానమును అనుభవమనియూ

వెనుక మనము ఈ విధముగా అనుభవించిఉన్న ఆధారముతో మనకు ఇప్పుడు కలుగు యదార్థనుభవముయొక్క ఆధారములోనే అయినప్పటికీ స్మృతియూ అనుభవమునకు అనుసారముగా యధార్థముగానే ఉండవలయునను నియమమేమియూలేదు. అది ఆయధార్థముగానూ ఉండవచ్చును. ప్రత్యక్షముగానున్న అనుభవమును ముఖ్యలక్ష్యముగా ఉపయోగించుకొని నిశ్చయించు జ్ఞానమునకు అనుమితి అందురు. ప్రత్యక్షము మరియు అనుమానము అను రెండుప్రమాణములను బౌద్ధులయందు కొందరు ఒప్పుకొనినారు. నైయ్యాయికులు ప్రత్యక్షము, అనుమానము, ఉపమానము, శబ్దము - అను నాల్గుప్రమాణములను ఒప్పుకొనినారు. ఆవువలె గవయ అను అడివప్రాణీ ఉన్నదనుదానిని తెలిసికొని అడివిలో చూచిన ఆ జంతువును ' ఇది గవయము అని నిశ్చయించుట ఉపమాన ప్రమాణముతో. ఆ ప్రమాణము ద్వారా కల్గు నిశ్చయజ్ఞనమునకు 'ఉపమితి' అని పేరు. శబ్దమనగా ఆప్తుడైనవాడు - తాను చూచినదానిని మరియొకరికి తెలుపగల విశ్వాసపాత్రుడైన పురుషుడు - చెప్పు వాక్యము. మనమే చూచి తెలియుటకు వీలులేకపోయిననూ, చూచి మనకు సరిగా చెప్పుదురను మన విశ్వాసమునకు పాత్రులై యున్నవారి మాటయొక్క ఆధారముతో తెలియునప్పుడు ఈ ప్రమాణమునుపయోగించెదము. పూర్వమీమాంసకులు ఈ నాల్గింటితో పాటు 'అర్థాపత్తి' మరియు 'అనుపలబ్ధి' అను ఇంకనూ రెండు ప్రమాణములను చేర్చుకొనినారు. 'అతను పగలంతా తినకపోయిననూ గట్టిగ, పుష్టిగా, దృఢముగా ఉండుటచేత రాత్రిపూట తినుచుండవలయును. 'అని కల్పించుట అర్థాపత్తి. యోగ్యమైన ఏ ప్రమాణముతోను అది ఉండుట తెలియవచ్చుటలేదు కావున అది అక్కడ లేదు అని నిశ్చయుంచుటకు అనుపలబ్ధి అనినారు.

ఈ విధముగా ప్రమాణములసంఖ్య యందు అను విషయమునందు దర్శనకారులయందు మతభేదములున్నవి. వాటిని సరియోకాదో - అని చూచు తర్కము యొక్క విషయమునందునూ మతభేదములున్నవి. ప్రమాణములు

స్వతఃప్రమాణమో, లేక మరియొక ఏదైనా గుణమున్నతో ప్రమాణమనిపించునో ? అను విషయములో వివాదమున్నది. ఈ విధముగా ప్రమాణముల విచారములకు ఏమతభేదముండుటచేత వాటి ద్వారా తెలిసిన జ్ఞానము యధార్థమనుటకు సర్వసమ్మతమైన కారణమును ఇచ్చుట ఎవరి చేతనూకాదు. ప్రమాణజ్ఞానములకు స్మృతియొక్క సహాయము ఆవశ్యముగా కావలసియుండుటచేత ఈ ప్రమాణజ్ఞానము యధార్థమో కాదో ? అనుదానిని నిస్సందిగ్ధముదా నిశ్చయించుట కష్టము. ఏ ప్రమాణమైనాసరే ఎందుకు ఒప్పుకొనవలయును ? అనువాదులు కూడా లోకమందున్నారు. శూన్యవాదియైన నాగార్జుడనువాడు లోకమందు ప్రతిపదార్థము మరియొకరి ఆపేక్షతోనే తోచుటచేతనూ 'ప్రతీత్యసముత్వన్నమైయుండుచేత' అనునది అతని పరిభాష - ఏ ఒక్కదానికి స్వభావమనునదే లేదు అని ఒక గ్రంథమందు చూపించినాడు. ఆయన 'గమనము' (పోవుట) అనునదే లేదనుదానిని ఏవిధముగా సిద్ధముచేసి నాడనుటకు ఒక ఉదాహరణ ఇచ్చినాటు : "గతం న గమ్యతే తావదగతంనై వగమ్యచే। గతాగత విలిర్ముక్తం గమ్యం మానం న గమ్యతే ॥" నడిచిపోయిన దారిని నడచుట అనునదిలేదు. నడవని దారిని నడచుటలేదు, ఇకపోతే గతము, అగతముకాక తర్వాత నడుపవలసిన దారియందు ఇప్పుడు నడుచుచున్నాడు అంటే ఒప్పుకొనవలసిన విషయముకాదు. గమనమనునది ఎక్కడనుండి రావలయును ? ఉత్పత్తియే, పుట్టుట అనునదే లేదనుటకు ఇది అతని యుక్తి 'సతశ్చ తావదుత్వ త్తిరసతశ్చన యుజ్యతే। నసతశ్చాసతశ్చేతి పూర్వమేవోపవాదితమ్॥' ఉన్నది (సత్) పుట్టదు, ఉండేఉంటే పుట్టుటయెట్లు ? (అసత్) లేనిది పుట్టుట అంటే ఏమి ? ఉన్నది లేనిది ఐనది పుట్టును అనినట్లయితే పూర్తిగా హాస్యాస్పదముకదా ? ఉన్నది మరియు లేనిది అనుమాటకు అర్థమున్నదా ? ఈ విధముగా ఉత్పత్తి, నాశము ఏదియూ లేదో, అట్లే దేనికినీ ఉత్పత్యాదులు లేవు అనునది ఆయన మతము, అయువంటి శున్యవాది ఏ ప్రమాణమునైననూ ఒప్పుకొనునా ?

అందుచేత ప్రమాణములతో ఏది సిద్ధమగునో అది సత్యమనుటకు

వీలులేదు. ఇట్లే అర్థక్రియాకారియైన పదార్థము సత్యము. ఉదాహరణకు తాగినచో దాహము తీరును కావున అగి నిజమైన నీరు అని తెలియవలయును - అని కొందరు చెప్పుదురు. సంవాదిప్రవృత్తిజనకమైతే అనగా ప్రవృత్తికల్గినతర్వాత మన మనస్సునందున్నట్లు పదార్థము దొరికితే అదిసరియైన జ్ఞానము - మొదలగు లక్షణములుకూడా చివరకు నిలువవు. ఎందుకనగా కలయందు దూరమందు నీరు ఉన్నట్లు కనబడును. మనము అక్కడకు పోయినతర్వాత ఒకతటాకము కనబడును. గానియందు స్నానమును చేసినచో మన బట్టయూ తడియును - అని పెటుటటకొనండి. అందుచేత అది సంపాదిప్రృత్తిజనకమైనది. అయితే అంతమాత్రముతో అక్కడ మనకు కల్గిన నీటియొక్క జ్ఞానము సరియైన జ్ఞానమనిగాని అక్కడ నిజముగా నీరు ఉన్నదనిగాని మనము అనుకొనుచున్నామా ? ఎప్పుడూనూ లేదు.

ఇది ఇలాగుండని ఈ విధమైన ప్రమాణములతో మనకు కలుగు జ్ఞానముగాని వాటితో మనకు తెలియవచ్చు వస్తువులుగాని నిడముగా ఉన్నవా ? లేక వట్టి మిధ్యగా తోచుటయేనా ? అనుదానిని అంతమాత్రముతోనే నిశ్చయించుటకు వీలులేదనినట్లయినది కదా? ప్రమాణములతో కలుగు అనుభవమేకార సుఖము, దుఃఖము, ఆశ్చర్యము భయము - మొదలగు వేదనలనుకూడా అనుభవమను శబ్దముతో పిలచెదరు.

ఈ విధముగా ఇంద్రియముల ద్వారా కలుగు ప్రత్యక్షానుభనము, మనస్సునందు కలుగు సుఖదుఃఖానుభవము, వేదనలరూపములతో కలుగు అనుభవములు - వీటన్నిటిని మనము అనుభవమనే వ్యవహరించుచున్నాము. వ్యపహారమనునది వ్యపదేశము (మాటతో తెలియుజేయుట చూపుట), ప్రత్యయము (మనస్సుతో పృత్తులద్వారా తెలిసికొనుట) ప్రవృత్తి (కార్యమందు ప్రవర్తించుట) - అను మూడిటికి పేరు. ఈ వ్యవహారము జాగ్రదవస్థయందే - ఇంద్రియములతో విషయములను తెలియుట జాగ్రత్తను అవస్థ యందే - నడచును. అందుచేత జాగ్రదావస్థ అనిననూ 'వ్యవహారవస్త' అనిననూ ఒకటే. ఈ అవస్థయందు

ఇంద్రియములతో ఎరుగవానిని ప్రమాతనియు, క్రియను చేయువానిని కర్తనియు ఫలమును అనుభవించువానిని భోక్తనియు పిలిచెదరు. ప్రమాత, ప్రమాణము, ప్రమేయము, ప్రమిత, కర్త, కారకము కర్మలు, ఫలములు  భోక్త, భోగ్యము, భోగములు, తృప్తి - ఈ వ్యవహారములన్నియు జాగ్రదవస్థయందే కలుగును. అందుచేత దీనిని ప్రమాతదృష్టియొక్క అవస్థ, కర్తృత్వబోక్తృత్వముగల అవస్థ అనియు పిలువవచ్చు.

ఇంతవలకు మనము వ్యవహారవస్థయందు 'అనుభవ' మను శబ్దమును ఎటువంటి అర్థములందు ప్రయోగించుచున్నామనుదానిని తెలుసుకొనినట్లయినది. అయితే వ్యవహారవస్థనే మనము మొత్తముగా తెలిసికొనుట దేనిద్వారా? 'ఇది వ్యవరావస్థ' అని దేనిబలముతో నిశ్చయించెదము? దీనిని మనము ఎసాధనమును ఉపయోగించుము:  ఇది మెలకువ అనునది మనకు నేరుగా కనబడుచున్నది. మన స్వరూపము అనుభవాత్మకమైయుండుటచేత - దీపముయొక్క ప్రకాశములోనున్న క్షేత్రమంతయూ ప్రయత్నవిశేషమును అపేక్షించక తోచువిధముగా వ్యవహారమంతయూ ఈ అనుభవములకే గోచరమగుచుచన్నది. లోకమందు అనుభవక్షేత్రమునకు లోబడని వస్తువేలేదు. ఇది మనస్వరూపమే అయి ఉండుచేత దీని విషయములో ఏ సంశయము రాదు. వేదాంతులు దీనినే ' అనుభవ' మను పేరుతో పిలిచెదరు. వ్యవహారదృష్టితో పిలుచు అనుభవములు గౌణములు, ఇదొక్కటే  ముఖ్యార్థమందు అనుభవము.

ప్రమాణ, ప్రమేయవ్యవహారమందు ప్రమాత అనిపించుకొనినవాడు సరిగా చూచినట్లయితే అనుభవసస్వరూపుడే అయిఉన్నాడు.

నేనో, నేనుకాదో ? అని ఎవరికి సంశయము కలుగదు. ప్రమేయములను గుర్తుపట్టుటకు ప్రమాణములు కావలయును, అయితే ప్రమాతను నిశ్చయించుటకు ఏ ప్రమాణము అక్కరలేదు. 'నేను ఉన్నాను' అనిపెట్టుకొనే కదా, ఏదైనా ప్రమేయమును తెలిసికొనుటకు ప్రమాణములను ఉపయోగించుకొనుట ? ఇంకొకమాట: ఇది ఇటువంటి వస్తువు' అని నిశ్చయించుకొను

ఎరుకకు 'ప్రమితి' అని పేరు. ఈ ప్రమితి చివరినిశ్చయమని ఆగుటకు కారణమేమనుదానిని మనస్సునందు నెమరువేసినట్లయితే అదికూడా అనుభవరూపమై ఉండుటే కారణమని చెప్పవలసి యుండును. అందుచేతనే సంశయమున్నప్పుడు దానిని ఇదే ప్రమితి అనగా చివరిఎరుక, పర్యవసానజ్ఞానము - అని ఏ ఒక్కరూ తెలియుటలేదు. అయినను ఈ విధముగా పరమార్థమైన అనుభవమే ప్రమాత, ప్రమితి - అను పాత్రలను వ్యవహార నాటకమందు వహిస్తునట్లయినది

ఈ విధముగా అన్ని వ్యవహారములకు గోడమీద వేసిన అన్ని బొమ్మలకు గోడయే ఆధారమువలె ఉన్నప్పటికీ ఈ అనుభవమునే జనులు మరిచిపోవుచున్నారు. చేపలు ఎప్పుడునూ నీటియందే సంచరించుచున్నప్పటికి 'మనమున్నది నీటి యొక్క లోకమనుజ్ఞానము' లేకనే యున్నట్లు మనందరమూ అనుభవమును అవలంబించుకొనే (అనుసరించుకొనియే) తెలుసుకొనుట, ఇచ్ఛగించుట, కర్మను చేయుట, ఫలమును అనుభవించుట - ఈ అన్ని వ్యవహారములను చేయుచున్ననూ సర్వాధారముగానున్న ఈ అనుభవమునే తెలియకుండా ఉన్నాము.

ఈ పరమరహస్యమును వేదాంతమందు ఉపయోగించుకొనినది అనుదానిని మొట్టమొదట బయట పెట్టినవారు శ్రీశంకరభగవత్పాదులవారు. ధర్మజిజ్ఞాసకు, బ్రహ్మజిజ్ఞాసకు ఉన్న వైలక్షణ్యమును చూపించుటకు బయలుదేరినప్పుడు వారు చెప్పునదేవనగా: "న ధర్మజిజ్ఞాసాయామివ శ్రుత్యాదయ ఏవ ప్రమాణం బ్రహ్మజిజ్ఞాసాయామ్, కిం తు శ్రుత్యాదయః అనుభవాదయశ్చ యథాసమ్భవమిహ ప్రమాణమ్। అనుభవావసాన త్వాత్ భూతవస్తువిషయత్వాచ్చ, బ్రహ్మజ్ఞానస్య"। (సూ.భా.2-1-2) ధర్మజిజ్ఞాన యందు శ్రుత్యాధులు మాత్రమే ప్రమాణమయి ఉన్నట్లు, బ్రహ్మజిజ్ఞాసయందు అవి మాత్రమే ప్రమాణములు కావు. మరేమనగా శ్రుత్యాదులు అనుభవాదులు ఇక్కడి ప్రమాణము. ఎందుకలగా బ్రహ్మజ్ఞానము అనుభవమందు పర్యవసానము కాతగినది: మరియు బ్రహ్మజ్ఞానములకు ఉండిఉ

న్న సిద్ధవస్తువే విషయమైయున్నది. ప్రమాణమును ప్రమాణములతో ప్రమేయమైన కొన్నిపదార్థములను మాత్రమే తెలుసుకొననగును. అనుభవ ప్రమాణముతో సమస్తవిశ్వముయొక్క తత్వమునే నిశ్చయించకొనమచ్చును శాంకర వేగాంతులు ప్రమాణాకీకమైన పరమార్థమును ఆనుభవముయొక్క ఆధారముతోనే విచారముచేసి నిర్ణయించుదురు.

# 6. అనుభవము

ప్రమాణముతో నిశ్చిచమైనదానినే యథార్థమని ప్రమాణవాదులు ఒప్పుకొందురు. అయితే ప్రమాణముయొక్క విషయమునకు వారిలోనే ఒకరికొకరికి మతభేదమున్నది, ప్రమాణముల శుద్ధికోసంవారు తర్కమును ఉపయోగించెగరు: ఆ తర్కవిషయములో మత భేదమున్నదని చెప్పినట్లయినది.

ప్రమాణముకంటెనూ పై మెట్టుఅయిన జ్ఞానముయొక్క ఆధారమును విచారమునకు ప్రమాణవాదులు తీసుకొనలేదు. అనుభవమే అన్ని ప్రమాణముల వ్యవహారమునకు పునాది. అనుభవముయొక్క ఆధారములేకుండా ప్రమాణవ్యవబాపము ఊపిరి తీసుకొనుటకు వీలులేగు. ఈ విధముగా ఉండుటచేత దీనికి 'అనుభవ' మనుపేరు ఆన్వర్థమగుట వీలులేదు. కావలెననినచో దీనిని పూర్వానుభవమని పిలువవచ్చు. శ్రీ శంకరభగవత్పాదుల వారు పరమార్థతత్వముయొక్క జ్ఞానము భూతవస్తువుయొక్క విషయమైఉండుటచేత బ్రహ్మజిజ్ఞాస అనుభవమందే పర్యవసానమగును. అందుచేత ఈ జిజ్ఞాసయందు వట్టి శ్రుత్యాదునే ప్రమాణముకాదు, అనుభవాదులు కూడా ప్రమాణమని ఉద్ఘోషించినారు. వారి మతమును విన్నవారికి ఎవరికైనాసరే ఇదియుక్తమనేతోచును.

ఈ రోజు ఈ అనుభముయొక్క విషయమందు ఇంకొంత విచారము చేయుదము, ఇంద్రియములు ప్రమేయమయియున్న పదార్థములను మాత్రము తెలుసుకొనును. ఈ ఇంద్రియములను మనస్సు తెలుసుకొనగలదు. అనుభవమో

? గ్రాహ్యగ్రాహకము అయిన ఈ రెండింటిని రెండు వేరువేరు పళ్ళను ఒకే వడికిలియందు పట్టుకొనినవిధముగా, తనలోపలికి విషయము ఇముడ్చుకొనగలదు. ఈ విషయము తెలియలేదు, ఇప్పుడు తెలిసినది అని రెండింటిని దేనిబలముతో నిర్ణయించెదమో అదే ఈ అనుభవము. నేను ఇప్పుడు స్వయముగా మేలుకొనినాను. ఇంతవరకు కల చూచుచుంటిని లేక నిద్రపోయితిని అని దేనిద్వారా రెండవస్థలను విషయముగా చేసికొనుచున్నామో అదే ఈరెండిటికంటెనూ వ్యాపకమైన అనుభవము. ఆత్మ 'స్వప్నాంతమ్ జాహపితాంతమ్ చోభౌ యే నానుపశ్యతి మహాంతమ్ విభుమాత్మానమ్ మత్వా ధీరో న శోచతి (కఠ4-4)' అను శ్రుతి ఆత్మానుభవమును అనుభవప్రమాణముతోనే తెలియజేయుచున్నది.

ప్రమాణములకు ప్రామాణ్యమును నిర్ధారించుకొనుటకని తర్కమును వ్యవహారమందు ఉపయోగించెదరు కదా? అలాగే అనుభవమను ప్రమాణమునకు ఒక విధమైన తర్కము కావలసియున్నది. వేరు వేరు అనుభవములను జోడించి తత్వనిర్ధారణమును చేసుకొను బుద్ధి వ్యాపారమునే ఇక్కడ తర్కమని పిలిచినది. అనుమానము, అర్థాపత్తి మొదలగు ప్రమాణమక్షనమైన తర్కము ప్రమాణశుద్ధి కని ఉపయోగించు అనిష్టప్రసంజతర్కము, మనస్సు యొక్క వృత్తి రూపములకు ఒకదానికొకటి నియకతసంబంధమును కల్పించుకొను కేవల (శుష్క) తర్కము - వీటన్నిటికంటెనూ వేరు విధమైన తర్కముగలదు. దీనికి అనుభవములే ఆధారము అనుభవములు ఈ విధముగా ఉండుటచేత ఈ తీర్మానమును చేయబడును. ఈవిధముగా ఉండేఉన్నది - అను తర్కమును చేసి అనుభవమందే పర్యవసానముచేయు ఉన్నతమైన తర్కము గలదు.

ఇంకొక ప్రశ్న : అనుభవమే అన్నిటికీ ఆధారమై ప్రమాణమైఉన్నది - అని కదా మీ సిద్ధాంతము ? అయితే అనుభవవిశేషములను జోడించి తర్కముతో తీర్మానముచేయు ప్రమాత వ్యవహార ప్రపంచమందుండును. తర్కమూ ఈ వ్యవహారప్రపంచమునకే చేరియున్నది. ఈ రెండిటికి ఆధారము అనుభవమే కదా

? అందుచేత అనుభవములను గురించి, లాటి ఆధాకముతోనే జీవించుతర్కము తానే ఎట్లు విచారము చేయును ? ఇది ఏవిధముగా సాధ్యమగును ? దీనికి సమాధానమేమనగా : అనుభవమే ప్రమాతయొక్క వేషమును ధరించి బుద్ధి యొక్క వృత్తిరూపమైన తర్కమును ఉపయోగించుకొనును. ఆతర్వాత చివరకుకలుగు ఫలరూపమైన అనుభవము నిశ్చయవృత్తి యొక్క చివర కనబడిననూ అదియూ నిజముగా  అన్నిటికీ ఆదారమైన అనుభవమే అయిఉన్నది. ఈవిధముగా అనుభవముతో కనుగొనినదానినే ప్రమాతవేషము అనుభవమే నిర్ణయించినట్లగును. ఇలాగుండుటచేత జిజ్ఞాసులైనవాడు ఒకవిధముగా ద్విభాషివలె ఉండును. ఇది మనందరి స్వభావమయిపోయినగి. 'నాకు రాత్రి ఒంటిగంట వరకు నిద్రవచ్చినది. ఆతర్వాత నిద్ర రాలేదు'. అని తన నిద్రానుభవమును జాగ్రత్ ప్రమాతయే చెప్పుట అందరికినీ తెలిసియున్న విషయము. ఇక్కడ అనుభవముతో కనుగొనినదానిని మళ్ళీ అనుభవమే ప్రమాతగా వివరించి చెప్పును. ప్రమాత నిద్రపోలేదు, వట్టిఅనుభవము స్మరణకు రాదు. అయిననూ ఈ రెండు మనకే వచ్చు (కలుగు) జ్ఞానవిశేషములని మనము నమ్ముచున్నాము కదా, ఏ మాశ్చర్యమిది:

శ్రుతి తత్త్వమని (అదేనీవై యున్నావు) అను అనుభవరూపముగానున్న పరమాత్మే నీవు అని ఉపదేశించుచున్నది. ఆ అనుభవస్వరూపమైన బ్రహ్మమును ఇంద్రియములతోనూ, మనస్సుతోనూ విషయీకరించుటకు ప్రయత్నముచేసి " మనకు 'నేను బ్రహ్మ' మను అనుభవము లేదు కదా," అని సామాన్యబుద్ధిగన డనులు ఆక్షేపించుచున్నారు. ఇక్కడ రహస్యమేమిటంటే ప్రమాత' సుషుప్తి మొదలగు అవస్థలయందు అనుభవస్వరూపమును కనుగొనినప్పుడు తన ప్రమాతవేషమును విడిచి అనుభవరూపవే అయిపోవును. అయితే మళ్ళీవ్యవహారమునకు వచ్చి ఆ అవస్థలవిషయముగా మాట్లాడునప్పుడు కుక& యొక్క వంకరతోకను తిన్నగాచేసివిడిచిన వెంటనే అది మళ్లీ వంకర అగునట్లే మళ్లీ మొదటివలె ప్రమాతయే అయిపోవును అందిచేత నేను అనుభవమయ్యే ( అనుభవముగానే) అనుభవమును కనుగొందునని అతని మనస్సుకు

హత్తుకొనుటయే నేదు. అయితే అధికారియైనవాడు గురువువద్ద ఆత్మ స్వరూపమునుగరించి విచారముచేయునప్పుడు, విశారమునకు మొదట ప్రమాతయే అయిఉన్ననూ, అనుభవరూపమైన బ్రహ్మమే అయిపోవును. ఇకపై అతను ఎప్పుడూ ప్రమాతగా కాడు (ఉండడూ). దీనినే 'సయోహవై తత్ పరమం బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి' ఎవడు ఆ పరబ్రహ్మను తెలుసుకొనునో ఆయన బ్రహ్మమే అయిపోవును - అని శ్రుతి చెప్పుచున్నది.

మనము ప్రమాతలమైఉన్నామను భ్రాంతితో బయటి వ్యవహారమును చేయుచున్నాము. విషయవైరాగ్యముతో సద్గురువు వద్దకుపోయి తత్త్వ శ్రవణమును చేయునప్పుడు 'పరాంచిఖాని' - అను శ్రుతివాక్యములె "నీవు ప్రమాతస్వరూపుడవు కావయ్యె నిజముగా ప్రమాతాగిభేదరహితుడవైన పరమాత్మవే, నీకు చావు లేదు. అమృత స్వరూపడవే" అను ఉపదేశవాక్యమును విని దానిఅర్థమును మనస్సునందు నెమరువేయుటకు ప్రయత్నించినట్లయితే మెల్లమెల్లగా ప్రమాతృత్వాభిమానము సడలుతూపోయి ప్రత్యక్‌దృష్టితో చూచు అభ్యాసము వచ్చును. చివరకు నేను ఎప్పుడునూ ప్రమాతస్వరూపుడును కాను. నిత్యశుద్ధబుద్ధముకుడైన బ్రహ్మస్వరూపుడనే అనునది అనుభవారూడమగును.

వాక్కును విచారించవద్దు వక్తనే విచారించవలయును. స్వప్నమునూ, జాగ్రత్తునూ మొత్తమునూ ఎవరు తెలుసుకొందురో వాడే మహాంతమైన విభువైన ఆత్మ' ఇటువంటి శ్రుతివచనములను ననముచేసినట్లయితే మనస్వరూపమైన పరమానుభవము మనకు దగ్గరగును. జాగ్రత్‌ప్రమాత స్వప్నమందు ఉండడు. ఈ రెండింటిని విషయీకరించు మనము ప్రమాత ఎట్లగుదుము ? ఇది అనుభవానుసారమైన తర్కము. సామాన్యమైన తర్కముందు అది గొప్పదగుటచేత ఇది చిన్నదిగా ఉన్నది' అనురూపమందు వృత్తులసంబంధముయొక్క రూపముందు తోచు విచారనియమమును మనస్సు బద్ధమైఉన్నది. అయితే ఈ స్వప్నజాగరితముల తర్కము, స్వప్న, జాగరితములను - రెండు అనుభవముల ఆధారముతో ఏర్పరచుకొని ముల్లుతోములును తీసివేయునట్లు

అనుభవానుసారమైన తర్కముతో కేవలము విచారముయొక్క అకారవిశేషమైన తర్కముయొక్క శుష్కతనమును గుర్తించవచ్చును. మనము జాగ్రత్ ప్రమాతగ ఉండే ఆత్మానుభవమనుగురించి విచారము చేయవలసియున్న వేరొక దారి లేదు - అనునది నిజము. విచారమునకు పూర్వమందు ప్రమాతృ, ప్రమాన ప్రమితి అను భేధమును పెట్టుకొనియే బయలుదేరవలసియుండును. అయితే ఈ అనుభవానుసారమైన విచారము పర్యవసానముచెందునపుడు ప్రమాతృత్వమేవహి నినర్తయతి అన్త్యం ప్రమాణమ్' అని ఆచార్యులు గీతాభాష్యమందు వ్రాసినట్లు పరమార్థముగానున్న అనుభవ (మాత్రము) మెుకదానినే మనము ప్రమాతాదిరూపభేదములలో వ్యవహరించుచున్నాము - అనునది మనసుకుహత్తుకొనును. శాస్త్రము లేనినస్తువును నిర్మించదు. ఉన్నదానిని తీసివేయదు. 'జ్ఞాపకమ్ శాస్త్రమ్ న కారకమ్' శాస్త్రము ఉన్నదానిని అనుభవమునకు తెచ్చి జ్ఞాపకంచేయును, క్రొత్తగా ఏమియూ చేయదు - అని ఆచార్యులు మరిమరి చెప్పెదరు.

ప్రమాణవాదులలో మతభేదమున్నది కదా ? ఈ విషయమందు మతము అన్నియూ ఒప్పుకొనవలయునని కొందరు. అన్నిటినీ తిరస్కరించవలయునని కొందరు ఈ విధముగా వాదులు భిన్నభిన్న అభిప్రాయములను బయటపెట్టుచున్నారు. అయికే వేదాంతులు చెప్పునదేమనగా : ఇదంతయూ బాహ్యవితారము. ఈ ప్రమాణవిషయకమైన విచారము తత్త్వనిశ్చయములకు అక్కరలేదు. 'అవినాశీ తు తద్విద్ధి యేన సర్వమిదం తతమ్' అను గీతోక్తివలె అన్నిటినీ వ్యాపించుకొని ఉన్న అనుభవస్వరూపమే ఆత్మవస్తువు. సూర్యోయథా సర్వరోకస్య చక్షుర్నవిప్యతే చాక్షుషైర్బాహ్యాడోషైఃఏక స్తథా సర్వభూతాస్తరాత్మ నలివ్యతే తోరదుఃఖేన బాహ్యః (కఠ) సూర్యుడు అన్నిటిని ప్రకాశింపజేయుతున్నప్పటికీ తాను ప్రకాశించి చూపించు అశుచి పదార్థముల దోషముయొక్క అంటు (స్పర్శ) అంటకనే ఉన్నట్లు' సర్వప్రమాణములకు అంతరాత్మఅయిన ఈ పరమానుభవము అన్నిటికినీ సాక్షి (యై) గా అన్నిటినీ

ప్రకాశింపజేయుచున్ననూ దానికి దేని అంటు (స్పర్శ) ఉండదు.

ఇంతవలకు చెప్పినది మనందరిస్వభావమును గురించియే, దీనిని ఏ శాస్త్రప్రమాణముతోనూ నిశ్యయించవలసినపనిలేదు. ఇదంతయూ మన అనుభవమేఅయి ఉన్నది. ఒకవేశ 'ఇది నాకు తెలియుటలేదు' అని మీరెవరైనా చెప్పినట్లయితే గుర్తురాలేదు (తెలియలేదు) అనునది దేనివల్ల తెలిసినదో అదేనేను ఇప్పుడప చెప్పుచున్న అనుభవముష అని నిశ్చయించుకొనండి

'జాగ్రత స్వప్నసుషుప్తులనునది మనందరి అనుభవమని మనము తెలిసినవారమువీటిని మనమే అనుభవించుచున్నామనుపుడు కూడా వీటిసాక్షియైన మన ఆత్మస్వరూపముయొక్క ఆధారముతోనే ఆమాటను అనుచున్నాము. ఈ అనుభవములకు ఇంతవరకు అను సరిహద్దులేదు, అనుభవము అన్నిటినీ వ్యాపించుకొనియున్నది. అన్నియూ అనుభవమే అయియున్నది. దానికంటే వేరుగా ఏ ఒక్కటియునూ లేనేలేదు. ఇలాగున్నదానిని శంకరాచార్యులు దయతో మనమనస్సుకు హత్తుకొనునట్లు చెప్పినారు. మనము అంతర్ముఖమును (లోపలిచూపును) సంపాదించుకొని వారిఅనుగ్రహముతో ఈ అనుభవముయొక్క తత్త్వమును కనుగొని ధన్యులమగుదుముగాక :

# 7. పర్వవ్యవహారమునకునూ ఆధారమైఉన్న అనుభవము

ప్రమాణ, ప్రమేయవ్యవహారమును అనుభవముయొక్క ఆధారముతో దాటవచ్చునను దానిని తెలిసికొనినట్లయినది. ఈ రోజుకూడా ఆ అనుభవమునుగురించి విచారమునే పొడిగించవలసినదిగానున్నది. ఈ రోజుకూడా ఆ అనుభవమునుగురించు విచారమునే పొడిగించవలసినదిగానున్నది. వ్యవహారమందు జ్ఞానము ఏవిధముగా కలుగును ? ఇంద్రియములకు విషయసంబంధమైనమాత్రముతో వాటిజ్ఞానము కలిగిపోవును. మనము ఇక్కడనేఉ

ండి కన్నుతెలచినమాత్రముతో దూరమందున్న కొండ,నది, చెట్లు - మొదలగు వాటిజ్ఞానము మనకు కలుగుచున్నది కదా? ఈ జ్ఞానమే కుతూహలము, ఇచ్ఛ. ద్వేషము - మొదలగు ప్రవర్తకదోషములవ్యాపారమునకు మూలము. వట్టిజ్ఞానముతో మనుష్యుడు వ్యవహరమందు ప్రవర్తించడు. 'ఇది మంచి లేక చెడ్డది' ఇది నాకు కావలయును లేకవద్దు అను బుద్ధికలిగినతర్వాతనే వస్తువులను సంపాదించుకొనుటకు లేక దగ్గరకురాకుండునట్లు చేసికొనుటకు ప్రయత్నించుటలో ఇచ్ఛాద్వేషాదులు కలుగును. ఈ ఇచ్ఛాద్వేషములకు ప్రవర్తకదోషములని పేరు. ఈ దోషములకు వశునైనవారు తమకు తెలియకనే ప్రవృత్తి నివృత్తులయందు ప్రవర్తించుదురు. ఆతర్వాత ఆప్రవృత్తినివృత్తులవలన తమకు కలుగుఫలమును కనుగొనిన తర్వాత 'ఈవిధముగాచేయుట సరియైనది లేక ఈ విధముగా చేయకుండాఉండవలసినది' అని నిర్ణయించుదురు. అది వ్యవహారమాత్రమును విశ్లేషణచేసినదాని ఫలము.

ఈ వ్యవహారమందు మనకు అన్నిటికీ మొదటకలుగుజ్ఞానము ఏవిధముగా కలుగును ? విషయము అనేక అంశములమొత్తమయినప్పటికీ మొత్తంవిషయమే మనకు కనబడిపోవును (తోచును) ఉదాహరణకు "ఇదిచారు" అను మొత్తంజ్ఞానము కలుగును, దీనియందు ఉప్పు, పులుసు, కారము అను అంశములు చేరిఉన్న అనునది ఆ పై విమర్శతో తెలియవలసినది "ఇదిచెంబు" అనుజ్ఞానము మొత్తముగా మొదటే కలుగును. ఇది ఇత్తడిది, గుండ్రముగానున్నది, ఒక శేరుపాలు పట్టుటకు ప్రమాణముదానున్నది, అను మొదలగుధర్మముల వివరములు ఆపై విచారముతో తెలియదగినవి.

ఇదంతము జ్ఞానముయొక్క విచారమైయున్నది. ఇక జ్ఞాతవైపు మనస్సునుపెట్టి చూద్దాము, అన్నివ్యవహారములకు జ్ఞాతయే మూలమైఉన్నప్పటికీ జనులు ఇతని తత్త్వమునే (విషయమునే విచారమునకు తీసుకొనుటలేదు. "అన్ని పురాణములు ఎరిగినా వందువు నీపురాణమును నీవు ఎరుగవు" అని శ్రీ చివానంద అవధూతలు వ్రాసినట్లు జ్ఞేయమునుగురించిన విచారమును ఎంత

తెలిసినవారుకూడా జ్ఞాతయొక్క అనగా జ్ఞేయమును ఎరుగువారైననూ తమవిచాకమునే చేయుటలేదు. శంకరభగవత్పాదులు అధ్యాసభాష్యమందు వ్రాసినదేమనగా "దేహేంద్రియాదిషు అహమదాభిమానరహితస్య ప్రమాతృతావనుపపత్తౌ ప్రమాణప్రవృత్త్యనుపపత్తేః" దేహహమును నేననియు ఇంద్రియాదులను మనవనియు పెట్టుకొనక నేను జ్ఞాతనుకాజాలను: అ.టతే దేహమును నేనని పెట్టుకొనుటకు (అనుకొనుటకు) ఏ ఒక్కప్రమాణము లేకపోయినప్పటికీ దీని యందు మనకున్నంత అభిమానము మరిదేనియందునూ ఉండదు. దీనికి షోడశోపచారములను చేయుటయే మన జీవనమయిపోయినది, 'ఇది శరీరము, ఇదేనేను' అనుదానిని మకి ఏ ఒక్కరిచేతను చెప్పించుకొనలేదు : పిల్లలు పాఠమును కంఠస్థము చేసుకొనునట్లు 'నేను శరీరము, నేను శరీరము' అని జనులు కంఠస్థము చేలురొనపు, 'నేను, నాది' అను వ్యవహారము మనకు నైసర్గికమైయున్నది. ఏనిచారములేకుండగనే ఆ విధముగా పెట్టుకొను స్వభావముతోనే వ్యవహరించుచున్నాము. ఈ శరీరేంద్రియముప అభిమానమను గోతిలోపడకుండా ఉన్నవాడేలేడు. 'ఇది అవిద్య, తప్పుజ్ఞానము (తప్పుతెలివి) : నీవు శరీరముకాదు ఇంద్రియములు నీకుచెరవు!' అని వేదాంతులుచెప్పినచో దానిని ఏవోక్కరూ చెవిని వేసుకొనరు. 'ఆశరీరం వావసంతం నప్రియాప్రియేస్పృశతః' ఆశరీరుడుగానున్నవానిని ప్రియాప్రియములు స్పర్శించవు అని శృతి చాటుచున్నది. అయితే ఈ విషయమందు - తమకు నిజముగా శరీరము లేదు - అను విషయమందు - సామాన్యులకు ఎప్పుడునూ నమ్మికయుండజాలది.

ఇప్పుడు అనుభవానుసారముగా ఈ జ్ఞాతృత్వాభిమానమును కొద్దిగా విప్పి చూద్దాము. మనకు ఇప్పుడున్న శరీరేంద్రియాదులయందు 'నేను, నాది' అను అభిమానము ఎంత బలముకలదైననూ, ఇది స్వప్నమందు పూర్తిగా తుడుచుకుపోవును: అక్కడ వేరు శరీరము, వేరు ఇంద్రియములు, వాటితో వేరు విషయములజ్ఞానము - ఇట్లున్నది, అనుభవము ! ఇదేకాక మనకు ఒక్కొక్క స్వప్నమందు ఒక్కొక్క శరీరాదులుండవు. అయితే అక్కడ మనమే లేము అని

ఎవరునూ తోలుసుకొనరు కదా ? ఇట్లున్ననూ సామాన్యముగా మనశ్రీందరము ఈ జాగ్రతశరీరాదులనే 'నేను నాది' అనుకొనుచున్నాము కదా ! అన్నిఅవస్థలను చూచుచున్న మనఆత్మస్త్రను, మన నిజమైన స్వరూపమును లెక్కకు నీసుకొనక ఉంటున్నాము కదా' ఎటువంటి మాయ ! ఈ భ్రాంతికి వేదాంతమందు 'అవిద్య' అను పేరును పెట్టినారు.

ఇంతవలకు మనము విచాలముతేసినది జ్ఞాచవిషయమునగల అజ్ఞానము. మనకు ఏ ఒక్కరికి 'నేను ఎవరను' ? అనునది తెలియదు. అయిననూ అక్షరమే తెలియని పిల్లవానికి పాఠము చెప్పుకొనుటకు బయలుదేరినట్లు, మనము జ్ఞేయస్వరూపమును గురించి 'ఇదిఏవి' ? అని విచారముచేసి నిర్ధరించుటకు బయలుదేరుచున్నాము అవిద్యాయమంతరే వర్తమానా ః స్వయంధీరా ః పండితమ్మన్యమానా ః దంద్రమ్యమాణా పరియన్తిమూఢా ః అంధేనై వనీయమానా యథాన్ధా ః (కఠ) అవిద్యలోనేఉండి తామే ధీరులము పండితులము, అనుకొనుచు, దారితప్పి ఎక్కడెక్కడో తిరుగుచూ ఉన్న గ్రుడ్డి వానిని మార్గదర్శకునిగా పోట్టుకొని ముందుకునడుచుచున్న గ్రుడ్డివానివలె కనిపించుచున్నారు అని శ్రుతిచెప్పినట్లున్నది మనస్థితి : మనకు ఇంద్రియములద్వారా బయటి కొన్ని దృశ్యములజ్ఞానము కలుగుచుండుట నిజము. అయితే తిమిరరోగము వచ్చిన వారికి బయట ఏమేమి కనబడుచున్నదో అదంతము నిజమని ఎవరుగాని నమ్ముదురు మనకళ్లు బయటి విషయముల ప్రకారముగా ఏమేమి చేప్పుచున్నదో అదే వాటితత్త్వమని ఏవిధముగా నిశ్చయించుట ? ఇంద్రియములకు కనబడు వస్కువులను పెట్టుకొనే మనము వ్యవహారమును చేయుచుండవలసినదిగా నున్నది అనుదానిని ఎవరుకూడా తీసివేయజాలరు.అయితే ఇంద్రియములు మనకు విషయము ఈ విధముగా తోచుచున్నది అని మాత్రమే చెప్పునేగాని 'ఇది నిజము' ఇది అబద్ధము అనేమీచెప్పదు. అవిచేసిన కథనముపై మనస్సు ఇదిసత్యము అని నిశ్చయము చేయుచున్నది. ఆ మనస్సు బయటికిపోదు. ఇంద్రియములు లోపరికిరాము. అయినా మనము (జ్ఞాతలు) ఈ మనస్సు చెప్పినది నిజమని నమ్ముకుని

వ్యవహరించెదను. అయితేనేనెవరు ? జ్ఞాతయొక్క స్వరూపము ఏవిధముగా ఉండును ? అనిగానిని ఇంద్రియములు ఎరుగవు, మనస్సుఎరుగది. ఈ విధముగా ఉన్నప్పటికూ మనకు ఇంద్రియములు, మనస్సు ఉన్నవి అనువిషయములో కొద్దిగాకూడా సంశయములేదు. అందుచేత జ్ఞాతనైన నేను జ్ఞాన కరణములేన ఇంద్రియములు మరియు మనస్సు - వీటినన్నిటిని ఎరుగునది ఎవరు ? అనుదానిని ఎరుగుచున్న ఎరుకయొక్క సారమొకటి యున్నది. అదే అనుభవమనునది. ఈ అనుభవముయొక్క బలముచేతనే ఇంద్రియములు, మనస్సు తమ వ్యాపారమును చేయుచున్నవి. ఈ వి,యమును గురుశిష్య సంభాషణముద్వారా కేనోపనుషత్తు ఈ విధముగా నిర్ణయించినది. కేనేషితం పతతిప్రేషితం మన ః కేన ప్రాణ ఃప్రథము ఃప్రైతియుక్త ఃకేనేషితాం వాచమిమాంవదన్తి చక్షుశ్శ్రోత్రంకఉదేవో యునిక్తి॥ (కే 1-1) ఎవరి ఇచ్ఛామాత్రముతో ప్రేరితమయి మనస్సు తన విషయములపై పడుచున్నది? ముఖ్యప్రాణము ఎవరిఇచ్ఛతో ప్రేరితమయి ప్రగతికరిగి ఉంటున్నది ? ఎవరి ఇచ్ఛకు లోబడి ఈ మాటలను జనులు మాట్లాటుచున్నారు ? చక్షురింద్రియములను శ్రోత్రేంద్రియములను వినియోగింటు దేవుడు ఎవరు ? అని అక్కడ శిష్యుడు అడుగును. దానికి గురువు ఇచ్చిన సమాధానమిది. శ్రోత్రస్య శ్రోత్రం మన సోమనోయద్ వాచోహవాచంసఉప్రాణస్య ప్రాణః చక్షుషశ్చక్షురతి ముచ్యదీరా ః ప్రేత్యాస్మాల్లోకాదమృతా భవన్తి ॥ (కే - 1-2).

నీవు అడుగుచున్న ఆదేవుడు శ్రోతమునకు శ్రోత్రము, మనస్సునకు మనస్సు, వాక్కుకు వాక్కు, ప్రాణమునకు ప్రాణము, చక్షువు - వీటన్నిటియందు - 'నేను, నాది' అను అభిమానమును వదిలి ఈ వ్యవహారలోకమునుండి ఆవలకు పోయిన వివేకులు అమృతులగుదురు.

ఈ వ్యవహారమునందు అన్నిటికి ములాధారముగానున్న జ్ఞాతృరూపమే అవిద్యా కల్పితమయినదు. ఎందుకనగా దేహేంద్రియాదులయందు 'నేను నావి' - అను అభిమానము లేకుండా ఆత్మజ్ఞాత కాజాలడు. ఇక అవిద్యా కల్పితమయిన

ఈ జ్ఞాతకు బయటి విషయములను తెలియు ఉపకరణమైన ఇంద్రియాదుల యోగ్యతను గురించి చెప్పుట ఏమిటి ? ఇక్కడ పరమార్థముగా ఉన్నదంతయూ అనుభవము ఒక్కటే. ఆ అనుభవమునే పరమాత్మ అని పిలచెదరు. "దేహదీనాం బుద్ధ్యన్తానాం ప్రత్యగాత్మత్వేన కల్పితానామ్ అవిద్యయా పరమః ఉపద్రష్టృత్వాదిలక్షణః ఆత్మా-ఇతి పరమాత్మా సః! అతః 'పరమాత్మా' ఇత్యనేన శబ్దేన చాపి ఉక్తఃకథితః శ్రుతౌ ॥" దేహ్మాస్త్ర, ఇంద్రియములు, ప్రాణము, మనస్సు, బుద్ధి, వీటినే అవిద్యతో మనలోపలి ఆత్మ అని జనులు కల్పించుకొందురు. వీటన్నికంటెనూ లోపలనున్న, మనకు చాలా దగ్గరనున్నవాడు గానూ వీటన్నిటి వ్యాపారమునకు తన సన్నిధిమాత్రముతో కారణుడుగా వీటన్నిటికీ తన చైతన్యముయొక్క ఆభాసమును ఇచ్చి తమతమ విషయుములను ప్రకాశించునట్లు చేయుచూ, వీటన్నిటినీ స్వతంత్రమైన తన చైతన్య ప్రకాశముతో ప్రకాశింపజేయుచు, అన్నిటికి సాక్షియై ఉండుటచేత పరమాత్మ (నిజముగా ఆత్మయైయున్నవాడు) - అని శ్రుతియందు ఈ అనుభవరూపమైన ఆత్మను పిలిచినది - అని శంకరాచార్యులు గీతాభాష్యమందు వ్రాసినారు.

అనుభవమనునది అంతఃకరణమందు కలుగు ప్రతియొక్క ప్రత్యయమునకు సాక్షిగా కనబడుటచేత దీనిని ఈ అనుభవరూపముతోనే తెలిసికొనవలసియున్నది. మనస్సు ప్రతియొక్క విషయమును ప్రకాశింవజేయునపుడు ఆయావిషయముయొక్క ఆకారమైన వృత్తులనుధరించుచున్నది. అప్పుడు ఆవృత్తి యందు తోచుచైతన్యము యొక్క ఆభాసముతో వస్తువు కనబడును. మన ఆత్మస్వరూపమే అయిఉన్న ఈ అనుభవమైతేనో ? అంటే వృత్తులు క్రొత్తక్రొత్తగా ఎన్ని రూపములను ధరించి కనబడినను వాటిని ఏ ఆయాసము లేకుండా ప్రకాశింపజేయుచు తాను ఉన్నట్లే ఉండి చూపించుతూ ఉండును. అందుచేతనే 'ప్రతిబోధ విదితంమతమ్' ఇట్లు ప్రతియొక్క భోధకు (ప్ర్యయమునకు సాక్షిగా ప్రకాశించు అనుభవరూపమే అతని అనుభవంతో తెలిసికొనినచో దానిని సరిగా చెలిసికొనినటులు యగును. ఇలాకాక దానిని తెలిసికొనుటకు వేరొకసాధనముగాని,

ప్రమాణముగాని లేదు అని ఉపనిషత్తు (కే.2-4) చెప్పుచున్నది. అంతఃకరణమునకు విషయాకారముగా పరిణమించు ఆయాసము కావలయును. అందుచేతనే ప్రమాణముతో తూతి తర్కముతో విచారముచేసి విషయమును నిశ్చయించుటచేత అంతఃకరణమునకు శ్రమ కలుగును. అయితే అనుభవము తాను ఉన్నట్లేఉండి నిర్వ్యాపారముగానే అన్నిటిని ప్రకాశింపజేయుటచేత దీనితి శ్రమ అనునదే ఉండదు. అంతఃకరణము యొక్క వృత్తులకు అనుభవమే ప్రమాణము. వాతిపుట్టుక, ఉనికి, చావు అన్నిటికి అనుభవమే ఆధారము (ప్రాపు) అనుభవమునకుమాత్రము ప్రమాణము అక్కరలేదు. తన యొక్క పుట్టుకనుగాని, వ్యాపారమునుగాని, నాశమునుగాని మనస్సుతో కల్పించుకొనుటకు కూడా వీలులేదు.

ఈ ఆత్మజ్ఞానమును వేదాంతముమాత్రము చూపించును. ఇందుచేతనే జీవులకు అమృతత్వము దొరుకును -అని ఉపనిషత్తులు ఘోషించుచున్నవి.

# 8. అవస్థలయందున్న అవిక్రియానుభవము

ఇంద్రియములు తమ తమ వ్యాపారమును చేయుచుండుటకు అనుభవముయొక్క ఆధాగవే కావలయును అని చెప్పినట్లయినది. ఇంద్రియములుగాని, అంతఃకరణము గాని తమతమ వ్యాపారముద్వారా ఎన్నో వికారములు పొందుతున్నప్పటికీ వాటి సాక్షిగానున్న అనుభవమందు ఏమార్పులు కలుగవనుదానిని చూపినట్లయినది. ఈ అనుభవమునకు అనుభవముకాక మరి ఏసాధనము లేదనియూ గుర్తిచేసినట్లయినది. ఈ రోజున కూడా ఈ నిర్వికారమైన అనుభవముయొక్క విచారమునే పొడిగించుదాము.

బాల్యాదిష్వపి జాగ్రదాదిషు తథాసర్వాస్వవస్థాస్వపి ।
వ్యావృత్తానువర్తమానమహమిత్యంతః స్ఫురన్తంసదా ॥

అని దక్షిణామూర్తిస్తోత్రమందు చెప్పినట్లు అవస్థలన్నిటికి ఈ అనుభవరూపమైన ఆత్మే సాక్షిగా ఉన్నాడు. 'అవస్థ' అంటే ఏమిటి? 'విశేషః కాతికోవస్థా' వస్తువుకు కాలముతో కలుగు విశేషమే 'ఆవస్థ' . అదే - ఇది -యను ప్రత్యభిజ్ఞ కలిగి ఉండవలయును. మార్పుపొందుతూ ఉండవలయును - ఈ విధముగా కాలమందుండి వివిధములైన పరిణామములను పొందుతున్న వస్తువుకు 'పరిణామనిత్య' మని పేరు ఉదాహరణకు మామిడికాయగా ఉండి, దోరకాయగామారి, ఆతర్వాత పండుగా అగును. అది పరిణామముతో వేరువేరు అవస్థలు కలిగిఉండును అయితే ఏది ఏవికారమును పొందక తాను ఉన్నట్లే ఉండునో దానిని 'కూటస్థ నిత్యము' అని వేదాంతులు పిలిచేదరు. మన దేహాదులు మారుచునే ఉండును. అయితే మనలోపలనున్న అనుభవస్వరూపమయిన ఆత్మ కూటస్థనిత్యుడు. తానున్నట్లే ఉండును. అయితే మనలోపలనున్న అనుభవస్వరూమయిన ఆత్మ కూటస్థలిత్యుడు. తానున్నట్లే ఉండుటచేత అతనికి నిజముగా అవస్థలనునదే లేదనునది సిద్ధాంతమైయున్నది.

భగవంతుడు అర్జునునికి 'దేహినోస్మిన్ యథా దేహే కౌమారం యౌవ్వనంజరా ! తథా దేహాన్తరప్రాప్తిధీరత్తత్ర నముహ్యతి" (గీ. 2-13) దేహియైనవానికి కౌమారము, యౌవ్వనము, ముసలితనము - ఇవి ఏవిధముగా కలుగునో, ఆవిధముగానే మరియొక దేహము వచ్చును. వివేకియైనవాడు ఈ విషయమందు మోనమును పొందడు అనుచున్నాడు. ఇక్కడ భగవంతుడు జీవునికి బాల్యము, కౌమారము జరామరణము వచ్చునట్లు దేహాంతరప్రాప్తియూ కలుగును అని చెప్పుటకు రాలేదనునది స్పష్టముగానున్నది. ఎందుకనగా అర్జునునిరి జాన్మాంతరము, పాపము, పుణ్యము స్వర్గము,నరకము - మొదలగువాటి జ్ఞానము లేదని మనమెవ్వరము ఒప్పుకొనవలసినది కాదు. ఆయనే "మనము మహాపాపమును చేయుటకు బయలుదేరినాముకదా ? వర్ణసంకరముతో నరకమేకదా కలుగునది" అను మొదలగునవి చెప్పుచున్నాడు. అతనికి ధర్మము ఏది ? ఆధర్మము ఏది ? అని తెలియవలసియున్నది. "ధర్మవిషయమందు నాచిత్తము సమ్మోహమును

పొందిఉన్నది. అందుచేత అడుగుచున్నాను" అనికదా చెప్పినాడు. ఆ కారణము వల్ల ఈ భగవద్వాక్యము జన్మాంతర పాపపుణ్యముల విష.ముకాదు. మరేమనగా ఆత్మజ్ఞానముయొక్క విషయము. అశోచ్యా నన్వశోచస్త్వమ్ (గీత 2-11) అని ప్రారంభించినది. సంసారమునకు కారణమయిన శోకమోహములను తొలగించుకొనుట కోసమే 'మహతి శోకసాగరే నిమగ్నస్య అర్జునస్య అన్యత్రాత్మ జ్ఞానాదుద్ధరణమపశ్యన్ భగవానం వాసుద్వః, తతః కృపయా అర్జునమ్ ఉద్దిధీర్షుః ఆత్మజ్ఞానాయ అవతారయన్ ఆహ" ఆత్మజ్ఞానమును వదిలితే మరిదేనితోనూ సాధ్యముకాదని చూచిన వాసుదేవ భగవంతుడు దయతో అర్జునుని ఉద్ధరించుటకు ఆత్మజ్ఞానమునకు వవతరణికగా ఈ విధముగా ప్రారంభించినాడు - అని ఆచార్యులు వ్రాసినది ఈ సందర్భమునకు సరిపోయినది. అందుచేత వారు వ్రాసినట్లు ఇక్కడ బాల్యాద్యవస్థలు వచ్చిపోతున్నప్పటికి ఆత్మ అవిక్రియుడుగానే యున్నాడు. అందుచేత మరణవుకలిగి దేహాంతరము వచ్చిననూ ఆత్మకు ఈ ఏ అవస్థలు వచ్చుటలేదు. బాల్యాద్యవస్థయందు స్థూలసూక్ష్మదేహములున్న స్థితి కౌమారమందు ఉండుటయేనేదు. ఆ స్థితియొక్క దేహాదిధర్మములు యవ్వనమందు పూర్తిగా పోవుచున్నవి. ఈ విధముగానే ముసలితనమునందు వెనుక అవస్థలయందున్న ఏ దేహాదిధర్మములు ఆత్మను అంటవు. ఆత్మస్త్రమాత్రము నిర్వకారముగా కూటస్థనిత్యముగానే యుండును. ''వెనుక అవస్థలసంస్కారము ముసలితనమునందునూ ఉండదుకదా? అను ప్రశ్నకు తర్వాత శ్లోకమందున్న ' ఆగమాపాయినః' అనునదే సమాధానము. అందుచేత బాల్యాద్యవస్థలు నా&.వృత్తమైనప్పటికీ అనుభవరూపమైన ఆత్మ అనువృత్తముగానే ఉంటున్నాడు. ఆ అనుభవముయొక్క వ్యాప్తి బలముచేతనే ఈ స్మృతి మొదలగునవి కలుగుచన్నవి తెలుసుకొనవలయును - అనుదానిని మాత్రమే ఇక్కడ తెలిసికొనవలసినదిగా యున్నది. ఈ కారణముచేతనే వెనుక శ్లోకమందు ' నత్వేవాహం జాతునాసం నత్వం నేమే జనాధిపా ః । నచైవ నభవిష్యామః సర్వే వయమత ః పరమ్' అని చేప్పుటయందు ఆత్మ ఉండేఉండును. జన్మాంతరములు వస్తూనే వున్నవి'

అనునదేమియు వివక్షితముకాదు. ఆత్మస్వరూపము కొద్దిగాకూడా మార్పు లేకుండా ఉన్నది. ఒక్కొక్క దేహమునకు ఒక్కొక్కటిగా ఆ కూటస్థనిత్యమైన ఆత్మ వేరేవేరుగా ఉండడు - అనునదే వివక్షితము. కూటస్థనిత్యుడూ, పరమార్థసత్యస్వ రూపుడు అయిఉన్న ఆత్మ ఒక్కటే సత్‌పదార్థము, మిగతాదంతయూ ఆసత్తు, తోచి ఎగిరిపోయే స్వరూరమైయున్నది - అనుదానినే ఇక్కడ భగవంతుడు చెప్పుటకు వచ్చినాడు. ఆత్మ అన్నిటికి సాక్షియై ఉన్నాడు ఆయన అనుభవరూపము కొద్దిగాకూడామారదు, దానికి జననమరణాదులు ఏవియూ అంటజాలవు.

ఈ విధముగానే జాగ్రదాద్యవస్థలు తోచి ఎగిరిపోయేవైనప్పటికీ వాటిగాసాక్షిగానున్న ఆత్మకూటస్థనిత్యమై ఉండుటచేత ఆయన అనుభవరూపబలముతో మనకు అవస్థలు కనబడుచున్నవను జ్ఞానము కలుగును. ఈ అవస్థలు ఒకటి ఉన్నప్పుడు ఇంకొకటి ఉండుటకు అవకాశమే లేదు. ఇలాగే పుట్టినాను, పెరిగినాను. చిక్కిపోయినాను మొదలగు మిగతా అలస్థలను తెలియవలయును. ఈ అవస్థలు వేటికి - అంటే దేహము, ఇంద్రియములు, అంతఃకరణము మొదలగువాటికి కలుగుతున్నాయని భావించు చున్నామో వాటి అవస్థలు ఒకటి ఉన్నప్పుడు ఇంకొకటి ఉండుటకు అవకాశమే లేదు. ఇలాగే పుట్టినాను, పెరిగినాను, చిక్కిపోయినాను మొదలగు మిగతా అవస్థలను తెలియవలయును. ఈ అవస్థలు వేటికి - అంటే దేహము, ఇంద్రియములు, అంతఃకరణము మొదలగువాటికి కలుగుతున్నా.ని భావించుచున్నామో వాటి అవస్థలు ఒకటి ఉన్నప్పుడు మరియొకటి ఉండుటలేదు. వాటి స్వరూపమే వార్పు అగుచున్నది. అందుచేత అవన్నియూ ఆసత్యము. 'ఆదావన్తేపి యనానస్తి వర్తమానేపి తత్తథా' అను న్యా,మువలె ఏది మొదట లేదో చివరలోకూడా ఉండదో అది సత్యముకాదు. ఆలుచిప్పయొక్క వెండి, త్రాడునందుదల పాము మొదలగునవి తోచునట్లు అవి వట్టి మిథ్యాభాసములు. జాగ్రదావస్థయందు కాలదేశములున్నవి. అయితే నిర్వికారమైన ఆత్మ కాలాదుల ఆధారముతో ఉండడు. ఆయన వాటికికూడా సాక్షిగా కాలాదులకంటే ఆవల వేరుగా ఉండును.

స్వప్నమందు జాగ్రదావస్థయొక్క కాలాదులు లేవు, వేరైన కాలాదులే ఉండును. సుషుప్తి (గాఢనిద్ర) యందైతే కాలాదుల పొళుకువ కూడా లేదు. ఆత్మ తాను ఉన్నట్లే ఉండును. ఈవిధముగా ఉన్నప్పటకీ రాత్రి 11 3/4 గంటకు పడుకొని నిద్రపోతిని, ప్రొద్దున్నే 4 1/2 గంటకు మేల్కొనినాను' అని మనము వ్యవహరించుచన్నాముకదా, కాలమందు లేని గాఢనిద్రను జాగ్రత్ కాలమునకు చేరిన 11 3/4 గంటలయందున్నట్లు భావించుచున్నాముకదా ! నిద్రయందు కాలమే లేక పోయినప్పటికీ అంతకాలామూ నిద్రించుచున్నా అనుచున్నాముకదా! ఇది ఎంత ఆశ్చర్యకరమైన విషయము. జాగ్రతయందు దేశకాలనిమిత్తములకు కట్టుబడిఉన్న క్రియాఫలముల మహాప్రపంచమొకటి ఉన్నది. మనము నిద్రించి తసతనినచో అక్కడ మరి యొక ప్రపంచము మరియొక విధమైన దేశకాలాదులకు సంబంధపడిఉన్న దృశ్యముతో కూడి ఉన్నట్లు కలబడును, ఇలాగున్ననూ నాకు ఈ ప్రకారమైన స్వప్నము కలిగినదని చెప్పుచున్నావుకదా! జాగ్రతయందున్న దేహాదులు ఏవియూ కలయందుండవు : కలయం దున్నవి ఏవియూ జాగ్రతయందు ఉండవు జలకహాజురు ఒకసారి కలయందు 12 సంవత్సరముల క్షామము వచ్చినట్లును తాను భిక్షుకుడుగా గంజికోసం తిరిగినట్లు స్వప్నము కలిగినదట. ఈ విధముగా నున్ననూ మనము జాగ్రతనుండి కలకు పోయినట్లునూ కల నుండి జాగ్రత్తకు వచ్చినట్లునూ పెట్టుకొని మాట్లాడుచున్నాము. ఈ రెండవస్థలయందు ఏది సత్యము ? ఏది మిధ్య ? ఎందువలన ? ఈ ప్రశ్నలకు సమాధానమును ఇచ్చువారు ఏ ఒక్కరునూ కనబడుటలేదు.

ఈ విధముగా అవస్థలు కనబడి పోవునుండుటలో అన్ని అవస్థలయందునూ ఉన్నట్లు తోచు ఆత్మ ఏకాలమునకు చేరును ? ఏదేశమందుండును ? పక్షపాతములేని అను భవానుసారముగా చూసినట్లయితే ఆత్మ చైచన్యరూపమైన అనుభవము విషయముకాదు. ఆయన నిర్విశేషుడు, నిర్గుణుడు, నిష్క్రియుడు - అని చెప్పుకొనవలసినదిగా యున్నది. ఈ ఆత్మస్త్రను ఏ ఒక్క జ్ఞానమూ విషయికరించదు. ఆత్మలు అనేకమని ఆయనకు సంఖ్యను చేర్చుట వీలులేదు.

నిత్యపరయవుడగుటచేత ఆయనయందు ఏ ఒక్క వికారమును చూచుటకు వీలులేదు. ఆత్మయొక్క యథాత్మ్యమును నేను ఎరిగినాను' అనుట ఎటువంటి హాస్యాస్పదమైనమాట! బయటి విషయములను గురించి అవిద్యకూ ఆత్మనిగురించిన అవిద్యకూ ఎంత వైలక్షణ్యమున్నదనునది ఇప్పుడు మీకు స్ఫుటము కావలయును. బయటి విషయముల జ్ఞనము ఎంత ఎక్కువైనప్పటికీ మన అజ్ఞానము పూర్తిగా ఎప్పుడూనూ పోదు అను దానిని భౌతిక విజ్ఞాన శాస్త్రజ్ఞులై ఒప్పుకొనుచున్నారు. అది యుక్తమే అగును. దేశ కాలములకు అంతమున్నదా ? లేకపోతే మనకు ఎక్కడ ఎప్పుడు సర్వవిధములైన అజ్ఞానము బాగుగా పోయిననుదానిని గుర్తుపట్టుట (తెలియుట) ఎవరికైననూ ఎట్లు సాధ్యమగును ? అయితే ఆత్మవిషయమునందు ఇలాకాదు. కేహము, ఇంద్రియములు మనస్సు మొదలగునవి అప్పుడప్పుడు కనబడుతూ ఉన్నవి. అప్పుడే మనము దేహాదుల యందు నేను నాది' అను అభిమానమును పెట్టుకొందుము. అయితే కలయందు జాగ్రతయొక్క దేహాదులుండుటయేలేదు. అప్పుడు మనతు తాదాత్మ్య బుద్ధి ఉ ంటుంది. ఈ విధముగా దేహేంద్రియముల సంబంధము మనకు వచ్చిపోవుచున్నట్లుగా ఉంటున్నప్పటికీ మనకు అవి నిత్యముగా చేరినవే - అను తప్పు తెలివిపోకుండా ఉంటున్నదికదా ! ఇదేంతటి ఆశ్చర్యము ! అవిద్య అనగా దేహాదుల సంబంధముతో కూడిన భావన వచ్చి పోతున్నప్పటికీ నేను నా స్వరూపమందే ఉన్నానను దానిని మనస్సుకు తెచ్చికొన్నట్లయితే మనకు అవిద్యయొక్క సంబంధమున్నదని ఏవిధముగా చెప్పవచ్చును ? 'ఇంద్రియాణాం పృథగ్భావముదయాత్తమయౌ చ యత్ ! పృథుగుత్పాద్యమానానావ్ మత్వాధీరోనశోచతి ॥'

ఇంద్రియములు ఆకాశాది భూతములనుండి పుట్టుచున్నవి. అవి మన ఆత్మాను భవమునకు విషయమైఉన్నవి. ఆత్మ చైతన్యమునకు వాటికీ స్వభావమందు ఆత్యంత వైలక్షణ్యమున్నది ఇంద్రియములు జాగ్రతయందుండి విషయములను తెలుసుకొనును. స్వప్నమందు తత్కాలమునకు తోచు

ఇంద్రియములూ వాటి విషయములు కూడా ఇవి కావు. ఇవి స్వప్నమందు ఏక్కడనూ ఉండుటలేదు సుషుప్తియందు ఏ దేహేంద్రియాదుల సంబంధముకాని, అది మనకుకల్గునను అవిద్యగాని మన ఆత్మస్వభావము కానేకాదు .దానిని తెలుసుకొనిన వానికి శోకాది సంసారమే ఉండదు. ఎందుకనగా ఈ అవస్థల విచారమును ఏ అనుభవము యొక్క అధారమును పెట్టుకొని చేసినామో ఆ అనుభవమునకు ఏ ఒక్క అనాత్మ యొక్క సంబంధమూ లేదని విచిరముద్వారా నిశ్చితమైనది . జాగ్రతయందు కనబడు ప్రమాణాదులు ఒక్కొక్కటీ ఇప్పుడు 'నేనే సత్యము, నేనేనిత్యమని మనల్ని మోసము చేస్తున్నప్పటికీ ఇవిఏవియూ ఇతప అన్ని అవస్థలయందునూ ఉండవు. అందుచేత అవస్థలద్వారా మనకు కలుగునట్లు కనబడు విశేషస్వరూపము లేదనియూ ఏ అవస్థగాని ఏ విశేషముగాని మనకు లేవన్నట్టు నిశ్చయమైనది. ఇలాగని ఎరిగి పరమసత్యమైన ఆ అనుభవరూపమందు నిలుచొనుటే పరను పురుషార్థము అనునది వేదాంతము యొక్క ఉపదేశము.

# 9. నిర్విశేషమైన ఆత్మ

ఇంతవరకు మనము ఇంద్రియములు, మనస్సు - ఈ రెండు తమతమ వ్యాపారమును చేయుటకు ఆధారముగానున్న అనుభవమును గురించి విచారము చేస్తూ వచ్చినాము. ఆత్మ అనుభవస్వరూపమే అయిఉన్నాడు. ఆయనయందు ఏ విశేషములు లేవు. ఆయన నిర్వికారుడు, అచింత్యుడు, ఏ శబ్దములచేతనూ ప్రత్యయముల చేతనూ విషయీకరించుటకు వీలులేనివాడు - అని నిశ్చయించినాము.

ముండకోపనిషత్తు ఈ ఆత్మ స్వరూపమును తెలుపు జ్ఞానమును పరవిద్య అని పిలుచుచున్నది. శౌనకుడనువాడు అంగీరసుని "పూజ్యుడా ఏ ఒక్కదానిని ఎరిగినట్లయితే ఈ జగత్తంతయూ తెలిసినట్లగును ? అని అడిగినప్పుడు

అంగీరసుడు ఇలాగనేను - పర - అపర విద్యలు రెండున్నవని బ్రహ్మజ్ఞులు చెప్పుదులు. ఋగ్వేద,యజుర్వేదాది రూపమైన విద్యయే అపరవిద్య అనగా క్రిందస్థితిగల విద్య. అక్షరమను పరబ్రహ్మము ఎలా ఉన్నదనగా - యత్తదాద్రేశ్యమగ్రాహ్యమగ్రోత్రమవర్ణ మచక్షుః శ్రోతం తదపాణిపాదమ్ ! నిత్యం విభుం సర్వగతం సుసూక్ష్మం తదవ్యయమ్, తత్భూతయోనిమ్ పరిపశ్యన్ని ధీరా ః॥ (ముం 1-1) అది అదృశ్యమనగా ఇంద్రియములతో విషయీకరించి తెలిసికొనుటకు వీలులేనిది. ఎందుకనగా వీటన్నిటికి అదేఅత్మ లేక స్వరూపము. 'అలాగయినచో అటువంటి వస్తువు లేనేలేనట్లగనుకదా ! అని ఎలరైననూ అక్షేపించవచ్చు. అది సరికాదు, 'అదిలేదు' అని దేనితో నిశ్చయించుదునో అదే ఆత్మతత్త్వము. అది అగ్రాహ్యము, అనగా జ్ఞానేంద్రియములతో ఎట్లు దానిని తెలుసుకొనజాలమో అట్లే వాక్పాణి మొదలగు కర్మేంద్రియములతోనూ దానిని పట్టుకొనుటకు వీలులేదు. గ్రహణమునతు (గ్రహించుటకు) మూలమే అది, దానిని పట్టుకొనుటకు యత్నించువాడి ఆత్మేఅది. అది గ్రోత్రము అనగా ములములేనిది: ఏది మూలమో అది - కుండ, మూకుళ్లయందు మన్ను అనుగతమయి యున్నట్లు, మూలము నందు మిగతో అన్నియూ అన్వయమగుచున్నలి. ఈ అక్షరబ్రహ్మమే అన్నిటికీ మూలమై ఉండుటచేత దీనియందు అనుగతమై ఉన్న మూలము మకియొకటి ఉండదు. మనదేశమువారందరూ మనము ఇటువంటి గోత్రము కలవారము అనగా మనవంశమునకు ఇటువంటివారు మూలప్రవర్తకులు - అని ఎవరో ఒక మహాత్ముడయిన ఋషిని చెప్పుకొనుచూ వచ్చుచున్నారు. అయితే ఋషులందరుకునూ, పిత్రులకునూ మూలమై ఉన్నదే ఈ అక్షరము. సర్వమునకు మూలమయిన దీనికి మరియొక గోత్రము ఎక్కడ నుండి రావలయును?

ఇది అవర్ణము, వర్ణములనగా స్థూలత్వము మొదలగు ధర్మములు లేక పసుపు ఎరుపు - మొదలగు రంగులు - దేనికి రంగులుండులో దానిని 'ఇటువంటిది' అని వర్ణించుటకు వీలుండును. అయితే అక్షరములకు ఏ వర్ణములూ ఉండవు. గానిని ఇట్లు వంటిదని దేనిబలముతో వర్ణించవలయును ? ఇది అవచ్యమని

అభిప్రాయము ఆ అక్షరము అపాణిపాదము, అచక్షుశ్రోత్రము. కర్మేంద్రియములు కర్మేంద్రియములకు విషయముకావు : జ్ఞానేంద్రియములు జ్ఞానేంద్రియములకు విషయముకావు అందుచేత వర్ణించుటకు వచ్చు విషయముకాని జీవుడు ఇంద్రియములు గలవాడయిననూ అయి ఉండవచ్చును - అని కల్పించుటరు అవకాశమున్నది : లేనది. అయితే అదిచేతన స్వరూవచ్చును - అని కల్పించుటకు అవకాశమున్నది అయితే అది చేతనస్వరూపమే అయిఉన్నది, అయినప్పటికీ ఇంద్రియమూకాదు, ఇంద్రియముగలదికూడాకాదు.

ఈ విధముగా అది గ్రాహ్యమూకాదు, గ్రాహకముకాదు అని అనుటచేత అదినిత్యమన్నట్లయినది. ఈ విధముగానున్న విస్తువు ఎక్కడఉన్నదని ఎట్లున్నదని తెలుసుకొందుము ? అని శంకించవచ్చును. అయితే అది విభువు అనగా బ్రహ్మదేవుడు మొదలుగా స్థావరాంతమువరకు ఉన్న అన్ని ప్రాణుల రూపమందునూ తానేఉండి ఉన్నది. సర్వగతము ఆకాశమువలె అంతటా వ్యాపించుకొని యున్నది. అలాగయినయెడల మనకు ఎందుకు కనిపుంచుటలేదు ? అంటే అది సుసూక్ష్మమై యున్నది. శబ్ద,స్పర్శ,రూప,రస,గంధములు - మున్నగు గుణములుండుటచేత పంచభూతములూ, భౌతికవస్తువులూ కనుపించుచున్నవి. ఇవిఏవియూ అక్షరమునకు లేవు కావున అది సుసూక్ష్మము. అత్యంత సూక్ష్మమైయున్నది, అలాగయినచో ఇంత సూక్ష్మమయినచో ఒక రోజు కాకపోతే మరియొకరోజు నాశనము కావచ్చునుకదా : అంటే అట్లుకాదు : ఎందు కనగా అది అవ్యయము. నాశనము కాదగిన స్వభాపముకలదికాదు. దానికి శరీరమువంటి స్వరూపములేకపోవుటచేత అవయవముల నాశముద్వారా దాని నాశముకలుగజాలదు. దానియందు చేరినవస్తువు వేరొకటి లేకపోవుటచేత ధనాగారమును పోగొట్టుకొని క్రుంగి పోయిన రాజువలె అది ఖర్చుగుటకు వీలులేదు, దానికి గుణములే లేకపోవుటచేత గుణముల నాశమువల్ల కూడా నాశముకాదు.

అలాగయినచో దానిని ఎవరైననూ ఏ విధముగా తెలియగలరు ? అని ఎవరైననూ అడగవచ్చును. ధీరులైనవారు, వివేకులైనవారు ఇదియే సమస్త

ప్రాణులకు కారణమును దానిని తెలిసికొందరు. వారు దీనిని అంతటా దర్శించుచున్నారు. ఎవరైననూ దానిని ఎట్లుఎరుగుదురు ? - అనగా దీనికి ఇంతకుముందే సమాధానమును చెప్పబడినది. ఇది మనస్వరూపమే అయియున్న అనుభవమే అయిఉన్నది. దీనిని ఇంద్రియాది ప్రమాణములతో ఎరుగుటకు వీలులేదు. ఎందుకనగా ఈ అనుభవమే అన్ని ప్రమేయములను ఉన్నవి లేక లేవు అని కనుగొనగలిగినదై యున్నది. ప్రమాణములతో ఎరుగువానికి ప్రమాతృత్వముండవలయును. అయితే ప్రమాతృత్వము జాగ్రదవస్థయందు మాత్రమున్నది. స్వప్నమందు ప్రమాతయొక్క ఆధాసము మాత్రముఉండువు. అనుభవరూపుడైన మన ఆత్మే అయిఉన్న ఈ అక్షరము మూడు అవస్థలకు సాక్షియై యుండుటచేత ప్రమాణములను వాటి అభావమును చూడగలదు. లోకమందు కర్మేంద్రియములు వ్యాపారమును తేయగలవైననూ వాటికి జ్ఞానముండగు. జ్ఞానేంద్రియములకు జ్డానమున్ననూ చలనముండదు. ఇలాగున్ననూ ఈ రెండునూచేరి ఎలాగనో జాగ్రదవస్థయందు వ్యవహారమును సాగించుచున్నవి. అనుభవస్వరూపముయిన మన ఆత్మో ? అంటే పాణిపాదములు లేనిపాడైనా కర్మేంద్రియుములద్వారా అన్నిటినీ ఎక్కడనున్ననూ పట్టుకొనగలడు. చక్షుశ్రోత్రములు లేకపోయిననూ వాటిద్వారా చూడగలడు, వినగలడు, ఆయనే అన్నిటినీ తెలుసుకొనును, ఆయననుమాత్రము ఎరుగువారు ఏఒక్కరునూలేరు, ఇటువంటి విచిత్రశక్తి ఈ ఆత్మకు గలదు అని శ్రుతి చెప్పుచున్నది : 'అదినిజము' అని మనముకూడా అనుభవబలముతో దానికి పుష్టిని ఇయ్యవలసియున్నది. 'మాయాంతు ప్రకృతిం విద్యాన్మాయునం తు మహేశ్వరమ్' (ప్రకృతిని మాయఅని తెలియవలయును : మహేశ్వరుని మాయ అని తెలియవలయును) అనుశ్రుతి నిజమును చెప్పుచున్నది అని మన అనుభవము ఒప్పుకొనును. ఈ అనుభవమును వదిలితే ఎక్కడఏమున్నది - అనుదానిని ఎట్లు గుర్తుపట్టుటకు వీలగును ? అందుచేత అదేఅక్షరము, ఇదేఅన్నిటిని వ్యాపించుకొనియుండును - అనునదియుక్తమే.

వ్యవహారమందు 'విద్య' (జ్ఞానం) అనునది 'క్రియంకం' అంగమైయుండవలయును. వట్టిజ్ఞానము దేనికి పనికిరాదు. ఏ పనికినీ ఉ పయోగించనివిద్య అవిద్యయే అని జనులు చెప్పుదురు. అయితే పరవిద్యయొక్క విషయము ఇలాగుండదు అది మనకు ఒకసారివస్తే మళ్ళీ చేయతగినదేమియుఉ ండదు. కర్మకాండయందు చెప్పిన కర్మయొక్క విద్యయూ ఈ అర్థమందు పూర్ణముకాదు. శ్రీ శంకరాచార్యులు ఈ విషయమునకు వ్రాయునదేమనగా . యథావిధివిషయే కర్త్రాద్యనేకకారకోపసంహారద్వారేణ వాక్యార్థజ్ఞానకాలాదన్యత్ర అనుష్ఠేయో ర్థోస్తి అగ్నిహోత్రాది లక్షణః, నతథేహ పరవిద్యవిషయే, వాక్యార్థజ్ఞానసమకాల ఏవతు పర్యవసితో భవతి ॥' కర్మవిధి యొక్క విషయమందుకర్త మొదలగు కారకములను చేర్చుకొని - వాక్యార్థమును తెలుసుకొనుటయేకాక చేయవలసిన అగ్నిహోత్రము మొదలగు కర్మ ఉన్నదికదా ? అట్లే ఈ పరవిద్యవిషయమందులేదు. వాక్యార్థమును తెలుసుకొనినచో అదేకాలమందే అన్నియూ పరిసమాప్తమైపోవును. అని ఆచార్యుల పచనమునకు అభిప్రాయము. కర్మకాండయందున్న వివిధ వాక్యార్థమును తెలుసుకొని ఆ కారణముగా కర్మనుతేసినచో దొరకుఫలముకూడా అనిత్యమే అయిఉన్నది. ఇక్కడ ఎప్పుడునూ కారదేశముల హంగులేకుండా తనకుతానే నిత్యమైన అద్వితీయమైన నిష్క్రియమైన పరమాత్మవస్తువే మన ఆత్మ అను జ్ఞానము కలిగిన తర్వాత చేసిపోందవలసినది ఏదియూ మిగిలిఉండనే ఉండదు. మనము లోకమందు ఏవస్తువును పరిక్షించిననూ దానియందు ఉనికి అను స్వభావము అనుస్యూతమై ఉండును. ఇది అందరి అనుభవమందునూ ఉన్నది అయిననూ విషయమందే వ్యాపృతమైన ఉన్న మనము దానిని ఉచ్ఛరించి చెప్పము. ఇల్లు అనగా 'ఉన్న ఇల్లు, ఉన్న వాకిలి, ఇట్లే గుట్ట, కొండ, నది, సముద్రము, ప్రాణులు, మనుష్యులు - మున్నగు స్థలములయందునూ తెలియవలయును. ఉనికి చేరని వస్తువేలేదు. వ్యవహారమందుకూడా జ్ఞానము (చిత్) ఉనికి (సత్) సుఖము (ఆనందము) : అజ్ఞానము, లేకుండుట, దు:ఖము - ఇవి కూడికొనేయుండును.

జ్ఞానసుఖములయందునూ ఉనికి చేరియేఉండును. అయితే వ్యవహారమందు ఏమియున్ననూ ఆత్మానుభవమునకు పొందియేయుండును. వ్యవహారమునగల వస్తువులు ఏమియూ వేరువేరుగా కనబడని సుషుప్తియందు మందరికినీ మన సచ్చిదానంద స్వరూపము అనుభవమునకు వచ్చును : సుషుప్తియందు నా ఉనికి లేదను జ్ఞానముకాని 'మనము ఉన్నామో లేమో ? అను సంశయముకాని మనకు మరిదైనిని అక్కడ ఎరుగకపోయిననూ అక్కడ ఉన్న మనస్వరూప విషయమునందు అది సచ్చిదానందరూపమై యుండినది అను విషయమున ఏఒక్కకతీ సంశయములేదు. అక్కడ మనస్వరూపమునకు కాలము, దేశము, వస్తుపరిచ్ఛేదములు ఏవియూ ఉండవు. అందుచేత మనస్వరూపము అప్పుడు అఖండసత్తు (కొలతలేని, విచ్ఛిత్తికాని ఉనికి) అఖండచిత్తు (పరిచ్ఛేదములేని జ్ఞానము), అఖండానందము (పరిమితములేని సుఖము) - ఈ రూపముగానే ఉండినదని అనుభవానుసారముగా ఒప్పుకొనవలయును.

సుషుప్తియందు మనస్వరూపమందు ఏవిధమైన ప్రపంచముయొక్క భావము లేకపోయిననూ మనము మేల్కొనగానే శరీరము, ఇంద్రియములు, మనస్సు - అనియూ వచ్చిపడును : వీటితోసహా ప్రపంచజ్ఞానమంతము మనకు వచ్చిపడును. ఇట్లుండుటచేత ఈ మన అఖండసచ్చిదానందస్వరూపమైన ఆత్మే అన్నిటికి కారణము, అన్నియూ ఈ ఆత్మయొక్క కార్యమే అనియూ అగును.

ఆత్మకు, ప్రపంచమునకు కార్యకారణభావము ఎట్లు కుదురును ? - అనుదానిని ఇంకనూ మనము విచారమునకు పెట్టుకొనవలసినదై యున్నది.

# 10. కార్యకారణ భవముయొక్క తత్త్వము

ఆత్మతత్త్వమును వివరించు విశేషణముల అభిప్రాయమును సమాలోచన చేయుచూ అది 'భూతయోని' అనువలకు వచ్చినిలచినాముకదా? ఇప్పుడు ఈ విశేషణము యొక్క అభిప్రాయమునే కొంత వివరముగా విడదీసిచూద్దాము.

శబ్దస్పర్శాదిగుణములు ఏవియూలేని పరమాత్మ వస్తువునుండి సబ్దస్పర్శాదులున్నజగత్తు కలిగినవనిన ఎట్లునమ్ముట ? కార్యములకు కారణమునకు సాదృశ్యము ఉండవలయునుకదా ? ఆత్మవస్తువుకూ భూరాదిలోకములను తనయందు ఇముడ్చుకొనిన ఈ జగత్తుకూ ఏ సాదృశ్యము కనబడదుకదా !

ఈ శంకకు పరిహారమును కనిపెట్టుట మన పనికాదు, ఆత్మత్వమును జగత్తు కలుగుట అనుభవమందు ఉన్నదా, లేదా ? - అనుదానిని చూడవలయును. అట్లే అనుభవమందు ఉంటే తర్కముయొక్క ఆధారముతో చేయు శంకకు ఏమి విలువ కల్గును ? మన సుషుప్తియందు ఏ జగత్తూ ఉండదు : మన ఆత్మస్వరూపము మాత్రమే ఉండియుండును. ఇది అనుభవమందున్నది.మెలకువరాగానే ప్రంచమంతయూ తోచుచున్నది. ఇదియూ అనుభవమందున్నది. తోచు జగత్తుకు ఆత్మవస్తువుకాక మరియొక మూలమును మనము ఎక్కడనూ చూడము, చూచుట శక్యముకాదు. ఆత్మ, అనాత్మల జగత్తు - ఈ రెండింటిని వదిలితే మరి ఏ వేరుపదార్థమైననూ ఎక్కడ ఎట్లు ఉండును ? అందుచేత - అనగా ఆత్మయందే ఏదోఒక అద్భుతశక్తి ఉండుటచేత ఆయన ఉన్నట్లే ఉండి జగత్తుగాకూడా కనబడుచున్నాడు క్ష అని అనుభవమునకు అనుగుణముగా కల్పించ వలయున్నది. ఆయన అద్వితీయుడుగానే ఉండియుండే ఆత్మానాత్మరూపమైన జగత్తుగాను, ఆత్మానాత్మల రెండింటికి ఈస్వరుడుగాను కనబడుచున్నాడు అనునదే అనుభవానుసారమైన యుక్తి. 'అజాయమనో బహుధావిజాయతే' 'జన్మరహితుడుగా ఉండే బహువిధములుగా ఆగువాడు అనుశ్రుతియూ "అజో పి సన్నవ్యయాత్మ భూతానామీశ్వరోపి సన్ ! ప్రకృతిం సావమధిష్ఠాయ సంభవామ్యాత్మమాయయా॥" నేను జన్మరహితుడనైననూ ప్రాణులకు ఈశ్వరూడనే అయిఉన్ననూ నా ప్రకృతిని వశపరుచుకొని నామాయ ద్వారా పుట్టువాడను" అను భగవదుక్తియూ ఇట్లే చాటుచున్నవి. అందుచేతనే శాస్త్రము ఉన్నది ఉన్నట్లు తెలుపునేగాని లేనిదానినేమియూ కలుగజేయలేదు, 'జ్ఞాపకం శాస్త్రం ఐ కారకమ్'

అను న్యాయమును ఆచార్యులవారు మరిమరి మనముందు పెట్టుచునే వచ్చుచున్నారు. 'మన బైబిల్‌నందు ఈవిధముగా చెప్పలేదు. మన ఖరాన్‌నందు ఇట్లు చెప్పలేదు' అను మొదలగు మతాంతరులు పోట్లాడునట్లు వేదాంతులు శాస్త్రవాక్యమును వాక్యమును కారణముతో ప్రమాణముగా పట్టుకొనుటలేదు. " అనుభవానుసారముగానే ఈ వాక్యము చెప్పుచున్నది. 'మూడు నాల్గు ఏడు' అని ఎవరు చెప్పినను ప్రమాణమేకదా ! 'అట్లే ఈ తత్త్వము అందరి అనుభవములనకు వచ్చును - అనుకారణముతో గీనిని అనుసరించవలయును అనునదే వేదాంతము యొక్క న్యాయము. శ్రుతిని ఎవరైనా పొగడుటచేత దానికి ఎక్కువ ప్రామాణ్యమురాదు. మరెవరైనా తిరస్కరించుటచేత దానికి అప్రామాణ్యము రాజాలదు.

శ్వేతకేతువును బాలకుని పన్నెండు సంవత్సరములు గురుకులవాసముచేసి విద్యాభ్యాసమును ముగించుకొని వచ్చినప్పుడు గర్వముతో బిగుసుకొని ఉండేవాడు. అప్పుడు అతని తండ్రి "ఏమి నాయనా, ఇంత గర్వముతో తిరుగుచున్నావుకదా! దేనిని శ్రవణముచేస్తే శ్రవణముచేయనిదానిని గూడా మననము చేసినట్లు అగునో, ఎరుగనిదానిని కూడా ఎరిగినట్లగునో ఆ ఉపదేశమెట్లుండును ?" అని అడుగగా తండ్రి ఇచ్చిన సమాధానమిది : "యథాసోమ్యేకేన మృతిండేన సర్వం మృణ్మయమ్ విజ్ఞాతం స్యాద్వాచారంభణం వికారోనామధేయం మృత్తికేత్యేవ సత్యమ్" ఎట్లు ఒక మట్టిముద్దను మట్టియే అని తెలుసుకొంటే మట్టి నుండి వచ్చిన కుండ,చట్టి, మూకుడు - మొదలైనవి మట్టియే అని నిశ్చయించవచ్చునో, చట్టి మూకుడు - అను వట్టిమాటతో అనుటయేగాని కార్యమనునది నిజముగా లేనట్లేయగునో, మన్ను అనునదే ,సత్యమో అట్లే ఇక్కడనూ తెలివలయును. సద్రూపమైన బ్రహ్మయే నిజము కాతగినది: పృథివి, అప్పు,తేజస్సు - అనుభూతములు దాని కార్యమనునది వట్టిమాటే అగుచున్నది. అవి వేకులయినవారైతే కుండ, మూకుడు, చట్టి - మొదలగువాటివలెనున్న కార్యరూపమైన వస్తువునే చూచుచున్నారు. అయితే జ్ఞానులయిన వరికి కుండ, మూకుడు - మొదలహునవన్నియూ నిజముగా మన్నే

అనునట్లు, కారణమైన బ్రహ్మమే పరమార్థమని నిశ్చయమగును. 'జ్యోతీంషి విష్ణుర్భువనాని విష్ణుర్వనాని విష్ణుర్గిరయశ్చ విష్ణుః అన్నట్లు సూర్యచంద్రులు, లోకములు, అడవులు, గుట్టలు - మొదలయినవన్నియూ పరమాత్మమాత్రమే అను నిశ్చయమైయున్నది.

భాగవతమందు వత్సాపహరణమను కథవచ్చినది. అక్కడ బ్రహ్మ పరీక్షకని శ్రీకృష్ణుని స్నేహితులైన గోపాలకులను, గోవులను తనలోకమునకు గొనిపోయెను. అప్పుడు కృష్ణుడే గోవులు, దూడలు, గోపాలకులు - కృష్ణుడు అన్నియూ ఆయిపోయి ఒక లీలనుచూపించినట్లు వ్రాసియున్నది. జీవుడు తాలొక్కడే కలను అనుభవించుచున్నప్పటికీ ఆస్వప్నావస్థయందు జాగ్రదవస్థయందున్నట్లు ఒక ప్రపంచమందు తాను వ్యావహరించుచున్నట్లే తనతోపాటు ఇంకనూ అనేకమంది జీవులు ఉన్నట్లునూ చూచుచున్నాడనునది మనందరి అనుభవమందున్నది. స్వప్నమందు నిజముగా తోనొక్కడే ఉన్ననూ విచిత్రమైన ప్రపంచమును దానియందు అనేత చరాచరప్రాణులు, దేశకాలనిమిత్తములననుసరించి జీవులు కర్మలనుచేసి ఫలముననుభవించుచన్నారు అనుదానిని చూచిన మాత్రముతోనే అతని స్వరూపమందు ఏ హెచ్చుతక్కువలూ కలుగవుకదా ? మట్టినుండి కుండ,చట్లు వచ్చునట్లే తనస్వరూపమును మూర్పుచేసి ఎవరైనా ఆ కలయొక్క జగత్తును చేసినారని మనము నమ్ముతామా ? లేదు. ఇంకనూ లోతుకు విచారముచేస్తే మట్టి,కుండ, చట్లుగా మారినదని మనము భవించునప్పుడుకూడా అది మట్టికాని మరిఏదో ఒకవస్తువుగా అయిఉన్నదా? లేదు. అది ఎన్నోవిధములైన కార్యముల ఆకారమందుంనదానివలె కనిపించుచున్ననూ, అదంతయూ మన్నేగాని మరేమియుగాదు. అందుచేత ఉద్దాలకూడును బాలకునకు 'మృత్తికే త్యేవ సత్యమ్, మట్టి అనునదే సత్యము అని చెప్పుచున్నాడు. అలాగే దార్ష్ఠాంతికమునందునూ సద్రూపమైన బ్రహ్మమొక్కటే సత్యము : పుట్టునదంతయూ సద్బ్రహ్మమే. కార్యమనునది నిజముగ ఎప్పుడునూ కారణముగానే నుండును - అనుదానిని ఇట్లు తెలియజేసినాడు. అన్నేన శుంగేనాపో మూలమన్విచ్ఛాద్భిః సోమ్యశుంగేన

తేజో మూలమన్విచ్ఛ తేజసా సోమ్య శుంగేన సన్మూలమన్విచ్ఛ సన్మూలాః సోమ్యేమా ః సర్వా ః ప్రజాః సదాయతనా ః సత్ప్రతిష్ఠాః ॥ (ఛాం 2-8-4) పృధ్వీ అను కార్యముతో జలముఅను కారణమును తెలుసుకొనుము. జలము అనుకార్యముతో కారణమైన తేజస్సను మూలమును ఎరుగుము. తేజస్సను కార్యముతో సద్బ్రహ్మమను నుసమునే ఎరుగుము. ప్రాణులన్నియూ సత్తను కారణమునుండే పుట్టుచున్నవి, ఇప్పుడుకూడా సద్బ్రహ్మయందే ఉండియున్నవి. చివరకు సద్బ్రహ్మయందే పర్యవసానమగుతవి అని తెలియవలయును. 'కార్యమని మము పిరుచుచున్నది అది కారణమందు కల్పితమైయున్నది. కారణమే నానావిధమైన కార్యములుగా కనబడుచున్నది - అనునదే వేదాంతసమ్మతమైన కార్యకారణవాదను పరమార్థసత్యమైన బ్రహ్మమే 'సత్యం చానృతం చ సత్యమభవత్। యదిదం కించ। తత్తత్య మిత్యా చక్షతే ॥' సత్యమూ అనృతమూ సత్యమే అయినది. ఇది అని ఏ దేది కనుపించుచున్నదో ఇదంతయూ అదే ః దానినే సత్యమందురు - అను తైత్తిరీయ ( 2-6) శ్రుతికి ఇదే అభిప్రాయము. నిర్విశేషమైన బ్రహ్మమొక్కటే సత్యమూ, పరమార్థమూ, ఇక్కడ ఆకాశాది పంచమహాభూతములు, ఆ భూతములనుండి కలుగు భౌతిక వస్తువులు నిజమైనవి, అనృతమైనవి, ఉన్నవి, లేనివి - అని ఏమేమి తనబడుచూ వచ్చిననూ ఇదంతయూ దానియందు మట్టియందుచట్టి, మూకుడు మొదలగు వాటివలెను, తాడునందు పామూ, నీటిధార మొదలగు వాటివలె కనబడుదాని మిధ్యాభ్యాసములే. భగవంతుడు 'సంభవామ్యాత్మ మాయయా అని అర్జునునికి చెప్పినట్లు అంతయూ పరమార్థసత్యమైన పరమాత్మయొక్క తోపికయే, దీనిని సత్కార్యవాదము, మాయాకార్యవాదము అందురు.

పరమార్థమైన బ్రహ్మమే పరమకారణము. ఎన్నివిధములైన చిత్రవిచిత్రమైన జగత్తుదానినుండి పుట్టునదని చెప్పిననూ అంతటా ఆయన విస్తారమే (వ్యాప్తియే) 'ఏతావానస్య మహిమా' (ఇదంతయూ ఆయనమహిమయే). అతోజ్యాయాంశ్చపురుషః (దీనికంటెనూ ఆ పురుషుడు గొప్పస్వభావము కలవాడు) అనుశ్రుతి ఈ అర్థమును

చెప్పను: కారణము శబ్దమునకు చేయతగినది అను అర్ధమున్ననూ 'కార్యమనుటకు చేయబడతగినది అని అర్థమున్ననూ కార్యమైన జగత్తు క్రొత్తగా ఎవరిచేతనూ చేయబడలేదు. జగత్తును చేసిన పరమాత్మ ఏదోఒకక్రియను చేసి వికారమును పొందడు. 'తస్యకర్తారమపి' (మాం) 'విద్ధ్యకర్తారమవ్యయమ్' (గీ 4.13) కనబడురూపమైన సృష్టివ్యాపారముతో కర్త అని వ్యవహారదృష్టితో చెప్ప వలసిననూ అతను ఏమియూ చేయుటయేలేదు, ఏక్రియవల్లనూ అతనికి ఏవికారమూ కలుగుటయేలేదు.

ఇంకొక విషయమును మనము ఇక్కడ గుర్తు తెచ్చుకొనవలసియున్న ఉద్ధాలకుడు శ్వేతకేతువుకు చేసియున్న ఉపదేశమందు మనకంటే వ్యతిరిక్తము బ్రహ్మమను ఏదో ఒక తత్త్వము జగత్కారణమని చెప్పలేదు. సుషుప్తియందు యొక్కడునూ దేహము, ఇంద్రియములు, మనస్సు - మొదలగు అన్ని ఉపాధులనుపోగోట్టు కొని తన నిజమైనస్వరూపమందే కలసుపోవుచున్నాడు. ఆ స్వరూపమే సద్బ్రహ్మము బ్రహ్మమేనీవు - అని స్పష్టముగా ఆయన ఉపదేశించినాడు. భగవద్గీతయందు క్షేత్రజ్ఞంచాపిమాం విద్ధి సర్వక్షేత్రేషుభారత (13-2) అన్నిక్షేత్రములలోలను క్షేత్రజ్ఞుడను - శరీరములోపల ఉన్నట్లు తోచుచున్నజీవుడు, నిజముగా పరమాత్మే అని కృష్ణభగవానుడుకూడా ఉపదేశించినాడు. అందుచేత జీవులరూపముతో కనబడు ఈ ప్రపంచము కూడా అచేతన ప్రపంచమువలె నిజముగా పరమాత్మే అయిఉన్నది. సామాన్యజనులుకూడా 'నాకు అన్నియూ తెలియును, ఏమైనా చేయగలను' అని భావించు కొనుటకు పరమాత్మతత్త్వమే తామైయుండుటే కారణమని నిశ్చయించవలెను. సర్వ జగత్కారణమైన పరమాత్మతత్త్వముయొక్క వాజ్ఞానముతో ఎటువంటి పరమప్రయోజనము కలుగవచ్చుననుదానిని దీనితోనే మనము ఊహించుకొనవచ్చును.

# 11. జ్ఞాతృతత్త్వము

వేదాంతముయొక్క దృష్టియందు కార్యకారణభావమును నిరూపణచేయటమైనది. 'కార్యనియతపూర్వ వృత్తి కారణమ్' (కార్యమునకు పూర్వకారమందే నియమముతో ఉండవలసినది కారణము) అని తార్కికులు చెప్పుకారణలక్షణము శుద్ధముకాదు. ఎందుకనగా కాలమూ బ్రహ్మముయొక్క కార్యమే అయియున్నది. కాలము, ఆకాశము, వాయువు మొదలగు వాటినన్నిటికీ పరమాత్మతత్త్వమే పరమార్ధమైన ఆధారమైయున్నది. కాలాకాశాదియైన జగత్తంతయు దాని కార్యము, అనగా త్రాడునందు తాచు పామువలె మిధ్యాభాసమే అయిఉన్నది. దీనికంతటికి పరమాత్మే నిజమైన ఆస్పదమైయున్నాడు. కారణమే కార్యముగా తోచుచున్నది. కారణమందే ఈ అర్థమందే కారణమైయున్నది అనునగే వేదాంత తీర్మానము. ఇక్కడకు కార్యకారణవిచారమును నిలుపుదము.

ఈ రోజు ద్రష్టృత్వమును గురించి విచాకముచేద్దాము లోకప్రసిద్ధమైన జీవుని గురించి శ్రుతియందు 'ఏషహిద్రష్టాస్ప్రష్టా, శ్రోతా, ఘ్రాతా, రసయితామన్తా, బోద్ధా, కర్తా, విజ్ఞానాత్మా పురుషః (ప్ర 4-9) అని వర్ణించినది. ద్రష్ట (చూచువాడు), ఘ్రాత (వాసన చూచువాడు), బోద్ధా (ఎరుగువాడు), కర్త (చేయువాడు), - ఇట్లు ఆయా ఇంద్రియములయొక్క పనిని చేయుటచేత ఈ విజ్ఞానాత్మకు ద్రష్టృ, శ్రోత - మొదలగు పేర్లు వచ్చినవి. ఈ విధమైన పేరు ఆయా ఇంద్రియముతో (వల్ల) వచ్చినవే అని 'అకృత్స్నోహిస ప్రాణన్నేవ ప్రాణోనామభవతి ! వదన్ వాక్ పశ్యంశ్చక్షు శృణ్వాన్ శ్రోతం మాన్వానొ మనస్తాన్యస్యైతాని కర్మనామాన్యేవ ॥' (బృ 1-4-15) శ్రుతియూ మనజ్ఞప్తికి తెచ్చిఇచ్చుచున్నది. లోకమందు ఒకని కర్మయొకమక సంబంధములో తండ్రి కొడుకు, భర్త, అల్లుడు అనువిధములైన పేర్లువచ్చుట అనునదియూ ఈ పేర్ల యందు ఏ ఒక్కటియూ ఆతని పూర్వస్వరూపమును వర్ణింపజాలదనునదియూ మనకు తెలిసియే ఉన్నది. ఇలాగే ద్రష్ట,శ్రోత - మొదలగునవి ఆయాకర్మలవల్ల వచ్చునామములగుట చేత అవి ఒకని

పూర్ణస్వరూపమును వర్ణించి చూపించజాలవు : చూచునప్పుడే 'చూచువాడు' అని అనిపించుకొనును. చూచునప్పుడు చూచువాడు అనిమాత్రమే చెప్పించు కొనును. అందుచేత ఆ కర్మనామము ఆకృత్స్న్, పరిపూర్ణస్వభామును తెలుపునట్లు కాదు. అందుచేత ఆత్మేత్యేవోపాసేతాత్ర హ్యేతే సర్వ ఏకీభవంతి "అందుచేత 'ఆత్మ' అనే తెలియవలయును. ఎందుకనగా ఈ రూపముతో ఈయన ఈ అన్నిటిని వ్యాపించియున్నాడు. దానియందు ఈ అన్నియూ ఒకటి అయిపోవును. తదేతత్పద నీయమస్య సర్వస్య యదయమాత్మానే న హ్యేత్ సర్వం వేద' దీనినే తెలుసుకొనవలయును. ఎందుకనగా దీనివల్ల దీనినంతటినీ ఎరిగినట్లు అగును. 'ద్రష్ట' అనగా 'శ్రోత'ను చేర్చుకొనినట్లు అయిపోవును. చూచువాడు, వినువాడు, యోచించువాడు, ఎరుగువాడు అని ఆయాక్రియను చెప్పుటకు ఎట్లు 'అతను' అను ప్రత్యయమును తెలుగునందు చూపించుదురో అట్లే సంస్కృతమందు ద్రష్టా, శ్రోతా, మన్తా - అని తృచ్ ప్రత్యయమును ఉపయోగించుదురు. ఈ ద్రష్ట, శ్రోతాది రూపములన్నిటికీ సాక్షియే చూచు ఆత్మ వీటన్నిటినీ ఏ కాలపరిచ్చేదమూ లేకుండాతన స్వరూపమైన చైతన్యరూపమైన దృష్టితో చూచువాడు యుండును. 'సాక్షి' అను శబ్ధము 'సాక్షాత్ ద్రష్టరి సంజ్ఞాయామ్' నేరుగా చూచువాడు అను అర్ధముగల సంజ్ఞా నామము - అని వ్యాకరణము చెప్పినది. 'ద్రష్ట అనగా కంటి ద్వారముతో చూచువాడు. 'శ్రోత' అనగా చెవియొక్క ద్వారముతో వినువాడు : అయితే సాక్షి అనగా ఏ ఒక్క కరణసహాయము లేకుండా (ఏ ఒక్కకరణము ద్వారాకాక) నేరుగా తన స్వరూపమే అయిన చైతన్యముయొక్క ప్రకాశములో ప్రకాశించువాడు. అతనిని 'సాక్షి చేతా కేవలో నిర్గుణశ్చ (శ్వే ) అని శ్రుతివర్ణించినది.

పరిచ్ఛిన్నమైన ద్రష్ట, పరిత్ఛిన్నమైన దృశ్యమును తన శక్తికి తగినంత ప్రకాశింపజేయుచున్నాడు. అయితే సాక్షిరూపమైన ఈ పరమార్థ ద్రష్ట అనగా తానే కరణము, తానే దృశ్యము : తన స్వరూపముతో, అవిక్రియుడై యున్నాడు. ఆయన కేవలుడు, అనగా అద్వితీయుడు నిర్గుణుడు, నిర్ధర్మకుడు, అనగా నిర్విశేషుడు : అతనిస్వరూపమైన దృష్టికి లోపమనునదిలేదు, అది (ఆత్మ) లేగని కల్పించుటకే

వీలులేదు - అనిశ్రుతి పిల్లలకు ప్రేమతో ఉన్నదానిని ఉన్నట్లు తెలియజేయు విధమున ప్రపంచమంతటి రహస్యమైన ఆత్మతత్త్వమును తెలియజేయుచున్నది ఆత్మ శబ్దముయొక్క యౌగికార్థమును శంకరాచార్యులు ఒక పరాణవాక్యముయొక్క ఆధారముతో ఇట్లు వర్ణించినారు. "యచ్చాప్నోతి యదాదత్తే యచ్చాత్తి విషయనిహ ! యచ్చాన్య సన్తతో భావ స్తస్మాదాత్మేతి కీర్త్యతే ॥' అన్నిటిని వ్యాపించియుండుటచేతనూ అన్నిటిని తనలోపలకు తీసుకొనియుండుటచేతను విషయములను ఉపభోగించుట చేతనూ, అంతటా పరిచ్ఛేదము లేకుండా అనువృత్తముగానే ఉండుటచేతనూ ఇతనికి ఆత్మ అనిపేరు. 'అత్' అను ధాతువునుండి ఆత్మశబ్దము వ్యుత్పన్నమగుటవలన ఈ నాల్గు అర్థములు ఆత్మశబ్దమునకు కల్గును. వ్యవహారమునందు జ్ఞాతగా తోచుచున్న జీవాత్మ తత్త్వమేఇది.

ఆత్మ, విషయములను భోగించి తృప్తిని పొందుచుండుటయూ ఒక్కొక్కనికి ఒక్కొక్కవిధమైన విషయముయొక్క భోగముతో తృప్తి కలుగుటయూ వ్యవహారమందు కనబడుచున్నది. అయితే తృప్తియందు మాత్రము ఏ తారతమ్యమూ కనబడుటలేదు. శ్రీ మంతుడైన వానికి పంచభక్ష్య పరమాన్నముల మృష్టాన్నభోజనముతో కలుగు తృప్తియే గంజి అన్నమును తినువానికికూడా కలుగును. ఆ ఆత్మతే జఠరాగ్నియై ప్రాణుల దేహమందుండి అన్ని విధముల అన్నమును వచనమును చేయుచూ తృప్తిని కలుగునట్లు చేయుచున్నాడు. అందుచేత 'అహం వైశ్వానరోభూత్వా ప్రాణినాం దేజమాశ్రితః । ప్రాణాపానసమాయుక్త ః పచామ్యన్నం చతుర్విధమ్ ॥ (గీ 15 - 16) అను గీతా శ్లోకార్థమును స్మరించుచూ వైశ్వానరాగ్నియే భోక్త సోమాత్మకమే - అనుభావనతో భోజనము చేయువానికి అన్నదోషముయొక్క లేపమురాదని ఆస్తికులైన బ్రాహ్మణులు భావించుచన్నారు. పరమార్థ దృష్టితో అయితే సర్వసాక్షియైన ఆత్మ తన స్వరూపమైన చైతన్యముతో అన్నిటినీ విషయీకరించుటవల్లనే నిత్యయృప్తుడైన మహాభోక్త అనిపించుకొనును. లేక ఏకారణము లేకుండానే ఏ విషయముయొక్క హంగు లేకుండానే నిత్యతృప్తుడై

యుంటాడు. ఉదాహరణకు సుషుప్తుని చూడిండి. ఆచట ఏ విషయభోగమూ లేకుండానే అనాయాసమైన ఆనందమూ, తృప్తియూ ఆత్మయందుండుట అందరి అనుభవమందునూ ఉన్నది.

పరిచ్ఛిన్నమైన ద్రష్టకు విషయములవైపు పోవుటచేత వాటి దర్శనముతో మనస్సు చంచలమగుచూ ఉండును. మనస్సుమనస్సుగా ఉండునంతవరకు అది విక్షేపమును పొందుతునేయుండి విషయమునుండి విషయమునకు పరుగెత్తును. అయితే ఎప్పుడు ఆత్మవైపు మనస్సు తిరుగునో అప్పుడు మనస్సు ఆత్మ సంపర్కముతో అమనస్సే అయిపోవును. దానికి అప్పుడు చాంచల్యము ఎక్కడనుండివచ్చును ? నిజముగా చుస్తే మనస్సుకుకాదు, సమాధిరావలసినది - ఆత్మే సమాధి. మనస్సు ఆ నిత్య సమాధిరూపమైన ఆత్మే అగుస్థితియే పరమార్థసమాది అనుదానిని తోలియక సమాధి యందు శరీరము ఇంత ఎత్తునకు లేచినది,ఇటువంటి సిద్ధులు కలిగినవి అని పొగుడుకొనుచు కొందరు భ్రాంతులగుచున్నారు. ఈ ఆత్మయందు చిత్తముచేరి సుషుప్తి యందు ఎట్లో అట్లే చిత్ స్వరూపమే అయిపోవును. అదే నిజమైనసమాధి. సరిగా ఆత్మచిత్ స్నరూపమును కనుగొనినవారికి సిహజసమాధియే ఉండిపోవును. శ్రీ రామకృష్ణ పరమహంసల వారికి మట్టిబొమ్మయూ చిన్మయముగానే కనబడినదట. ఆత్మస్వరూమందే నిల్చొనిన వారికి ఎరుక మరుపులులేని ఎరుకగానే సర్వమూ అయిపోవును.

భగవద్గీతయందు శ్రీకృష్ణభగవంతుడు 'యానిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ ! యస్యాం జాగ్రతి భూతాని సానిశా పశ్యతో మునే ః'' అని అదేశించినది అక్షరశః నిజమైయున్నది. సామాన్యజనులకు పరమార్థ తత్త్వమునునదొకచీకటి యందున్న వస్తువై యున్నది. అది వారికి ఏ విధముగానూ గోచరమగు వీలులేదు : అటు వంటి అవివేకనిద్రయందు గురకపెట్టుచున్నారు, వారు ! అయితే అదే పరమార్థము జితేంద్రియుడుగా ఆత్మవైపు చూచుచున్న జ్ఞానికి - మిగతావారికి జాగ్రతయందు విషయములు ఎట్లు స్ఫుటముగా

కనిపించుచున్నవో అట్లు - పరమార్థరూపమైన ఆత్మ ఒక్కడే కనిపించుచున్నాడు. మిగతా జీవులు మనము మేల్కొనినాము ' అనుకొనుచున్నప్పుడే వారికి గ్యాహ్యగ్రాహక భేదమును చూచుట అను దీర్ఘ స్వప్నముయొక్క అనుభమున్నది. వారికి పరమార్థమనునది ఏదో ఒక భక్ష్యమో, పీతాంబరమో అయిఉండవలయును : అందుచేతనే ఈ జ్ఞానమువలనవారు ఇంతఆనందముతో ఉంటున్నారు అని తోచవచ్చును. కొందరికైతే పరమార్థజ్ఞానముయొక్క గొడవయే అక్కరలేదు. ఈ జ్ఞానము సంబంధముతో మనకెక్కడ వైరాగ్యము వచ్చునో అని వారి భయము ! పరమార్థమును కనుగొనిన మహాత్ములకు ఈ గ్రాహ్యగ్రాహక, గ్రహణ : జ్ఞాతజ్ఞాన, జ్ఞేయమును భేదము యొక్క వాసనయూ కనబడదు. వారికి జ్ఞాతస్వరూపమనునది అన్ని విభాగములనూ కరగించుకొనిన జ్ఞప్తిమాత్రము అని నిశ్చయము గట్టియై యుండును.

# 12. అమృతత్వము

జ్ఞాతయొక్క తత్త్వము నిత్యవర్తమాన స్వరూపమై 'అమృత' మై యున్నది అని ఉపనిషత్తు చెప్పినది. దేవతలు అమరులైయుందురని శాస్త్ర మందున్నదికదా ? అయితే వారి అమరత్వము ముఖ్యమైన అమృతత్వము కాదు. బహుదీర్ఘకాలము వరకు ఉండునది అను అర్థముయొక్క అమరత్వమది. నచికేతుడు నాచికేతాగ్నియొక్క ఉపాసనతో పొందు అమరత్వమును అడిగిన తర్వాత 'అన్యత్ర ధర్మాదన్యత్రాధర్మ దన్యత్రాస్మాత్ కృతాకృతాత్ ! అన్యత్ర భూతాచ్చ భవ్యాచ్చ యత్తత్పశ్యసి తద్వద॥ (క.1.2.14) ధర్మాధర్మముల కంటెనూ కార్యకారణముకంటెనూ భూతభవిష్యత్ కాలములకంటెనూ ఆవలనున్న తత్త్వమునే నాకు చెప్పు అని అమృతత్వముయొక్క జ్ఞానమును తెలియజేయుమని మృత్యుదేవతను వేడుకొనినాడు ! యాజ్ఞవల్క్యుడు తన భర్యలిద్దరికి తన ధనమంతయు (ఆస్తి) పంచిపెట్టి పరమహంసగా పోవలయుననుకొనినప్పుడు మైత్రేయి అను పెద్ద భార్య సకలసంపదలతో కూడిన ఈ భూమియంతయు దొరికినచో నేనుదానితో

అమృతురాలనగుదునా ? అనిఅడిగెను. యాజ్ఞవల్క్యుడు 'యథైవోపకరణవతాన్ జీవితం తథైవతే జీవితం స్యాదమృతత్వస్యతునాశా స్తివిత్తేన. జీవనముయొక్క ఉపకరణములన్నియు ఉండినచో జీవితము ఎలాఉండునో అలాగే యుండునుగాని విత్తముతో అమృతత్వము చిక్కునను ఆశను ఉంచుకొనుటకు వీలులేదు - అని స్పష్టముగా చెప్పివేసిరి.

,యేనాహునామృతా స్యాం కిమహు తేన కుర్యాంయదేవ భగవాన్ వేదతదేవమే బ్రూహి' దేనితో నేను అమృతురాలునుకానో దానిని తీసుకొని ఏమిచేయవలయును ? తమకు తెలిసియున్న తత్త్వమునే నాకు తెలపండి' అని అడిగినదట ! అప్పటికాలమందు ఇట్లు స్త్రీలు, పిల్లలు, బాలురు, బ్రాహ్మణులు, శూద్రులు - అందరూ ఆత్మజ్ఞానము దొరికినచాలునని వెంటబడుచుండెడివారు. ఇప్పటివారైతే, మనకు కూటికురాదు, గుడ్డకు రాదు - అటువంటి విద్యదేనికి ? - అని అడుగుదురు ! వారికి ఆత్మవిద్య అయితే దొరుకు విధములేదు, కూటికి, బట్టకు సరిపోవు. ఉపాయముకూడా తెలియకనే కన్ను మూయుటయే, వారిస్థితి !

ఇది ఇట్లుండనిండు. ఇంకొక ఉపనిషత్తునందు గురుశిష్యుల సంవాదమున్నది. అక్కడ మనస్సు ఇంద్రియములు ఎవరిచే ప్రేరితమయి తమతమ తమ వ్యాపారములను చేయుచున్నవి ? అని శిష్యుడు అడిగిన ప్రశ్నకు గురువు చెప్పిన సమాధానమిది :శ్రోతన్య శ్రోతం మనసోమనోయద్ వాచోహవాచం సవు ప్రాణస్య ప్రాణః॥ చక్షుషశ్చక్షురతి ముచ్యధీరాఃప్రేత్యా స్మల్లోకాదమృతా భవన్తి ॥ (కే-1.2) ఇంద్రియములన్నిటికి సాకముగా, మనస్సంతటికి సారమైన ఆత్మయొకడున్నాడు: ఆయనను ఎరిగి వివేకులు ఈ ఇంద్రియముల లోకమును దాటి అమృతులగుదురు. ఇంద్రియములయందే మరణము ఉన్నది : ఇంద్రియములు కామమునకు ఆధిష్ఠానము: కామముండిన రాముడుండడు: రాముడుండీన కామముండదు - అను సాధువుల ఉక్తిని సామాన్యజనులు తీసివేయుచున్నారు. 'మనకు దేవుడు ఇంద్రియములను యిచ్చినదెందుకు ? విషయభోగములు లేక పోతే ఈ ఇంద్రియములుండి వ్యర్థమేకదా ? అనునది

వారి ప్రశ్న. అయితే పరమార్థమేమి? ఇంద్రియములతోనే భోగలాలసతోనే - మనము ముర్తులుగానుండుట. స్వాభావికమైన ఇంద్రియ ప్రవృత్తులను 'కశ్చిధీరః ప్రత్యగాత్మానమై క్షదాప్పృత్త చక్షురమృతత్వ మిచ్ఛన్' (క.2-1) అని కఠశ్రుతి చెప్పినట్లు వివేకియైనవాడు వాటికిగూడా ఆత్మ అయిఉన్న పరమార్థవస్తువునే ఎప్పుడు కనుగొనునో అప్పుడే అతనికి అమృతత్వము దొరుకును. అవివేకులకు ఈ రహస్యము తెలియదు, తామసరాజప్రవృత్తులను వదిలి సాత్వికమైన ఆహారవిహారములనుగాని ఆచారవిచారములనుగాని సేవించు అభ్యాసమే చాలామందికుండదు. విషయముల విచారమే విచారము ! ఇక వారికి ఆత్మవిచారమునకు విడుపు ఎక్కడనుండి వచ్చును ? 'నేను ఎవఁరు? అను ప్రశ్నయే వారికి చిన్నపిల్లల ప్రశ్నగా తోచును.

అందుచేతనే శ్రుతి తత్త్వజిజ్ఞాసువులకు "మీరు ఇప్పుడే ఇక్కడే అమృతులయియున్నారు. ఇటువంటి అమృతస్వరూపమును తెలిసికొని మర్త్యులుకూడా ఎక్కడ మనలను మీరుదురో ? అని దేవతలు భయపడుచుందురు" - అని చెప్పుచున్నది. అమృత స్వభావమను నది క్రొత్తగా రావలసినదిగాదు.' యో విజ్ఞానే తిష్టన్విజ్ఞానాదంతరో యం విజ్ఞానం నవేద యస్య విజ్ఞానం శరీర్ యో విజ్ఞానమన్తరో యమయత్యేషత ఆత్మా న్తత్యామ్యమృతః (బృ.3-7-22) మనలోపలి అన్నింటికి లోపలనున్న విజ్ఞానము లేక బుద్ధి: ఈ బుద్ధి కంటెనూ లోపలఉండి దీనిని నియమముతో పనిచేయునట్లు నియమించువాటూ ఉన్నాడుకదా ! అతనిని ఈ బుద్ధి ఎరుగజాలదు

# 14. ఉపసంహారము

ఈ రోజు ఇంతవరకు చెప్పిన విషయముల ఉపసంహారమును చేయవలసినదిగా నున్నది. శంకరభగవత్పాదులు వేదాంతవిచారమునకంతటికీ అనుభవమే ప్రధానమైనదని చెప్పినారు 'న ధర్మజిజ్ఞాసాయామివ శ్రుత్యాదయ

ఏవప్రమాణం బ్రహ్మజిజ్ఞాసా యామ్, కిం తు శ్రుత్యాదయోనుభవాదయశ్చ యథాసంభవమ్ ఇహప్రమాణమ్ ॥ (సూ.భా. 1.1.2) ధర్మజిజ్ఞాసయందు కర్మకాండవాక్యములను విచారము చేయునప్పుడు వట్టి వాక్యములే ప్రమాణములైనట్లు ఈ బ్రహ్మ జిజ్ఞాసయందు శ్రుత్యాదులు మాత్రమే ప్రమాణములుగావు, మరేమనగా శ్రుత్యాదులు అనుభవాదులూ యథాసంభవముగా ప్రమాణమై యున్నవి. - అని వారు చెప్పినదానిని మరువక జ్ఞప్తియందుంచుకొనవలయును. 'ఇది శంకరుల అభిప్రాయము' అని మవడు గౌడపాదా చార్యులు, శంకరాచార్యులు, సురేశ్వరాచార్యులు - ఈ ముగ్గురి అభిప్రాయమనే గ్రహించవలయును.

జ్ఞానేన హి ప్రమాణేన అవగన్తు మిష్టం బ్రహ్మ ! బ్రహ్మావగతిర్హి పురుషార్థ ః నిశ్శేషసంసారబీజావిద్యాద్యనర్థనిబర&జణాత్ ॥ సూ.భా (1-1-1) అనునది ఇంకొక అనుభమ విషయకమైన వాక్యము. బ్రహ్మాపగతియే - అనగా బ్రహ్మాత్మానుభవమే నిజమైన పురుషార్థము. ఎందుకనగా అవిద్య మొదలగు అన్ని సంసార బాజములను - అనగా అవిద్యాకామకర్మలు - అను సంసారహేతువలన్నిటినీ బ్రహ్మానుభవమే నాశము చేయును. కర్మతోగాని, ఉపాసనతోగాని అవిద్యాది సంసారబీజములు నిశ్శేషముగా నాశము కావు. అవిద్య పూర్ణముగా పోయి, ఆత్మకంటే బయటనున్న ఏ ఒక్క కామమును ఆపేక్షించక, ఎటువంటి కామ ప్రాప్తికి కర్మయందు ప్రవర్తించకయుండుట అను పరమపురుషార్థము అద్వితీయమైన బ్రహ్మాత్మానుభవముతో మాత్రమే లభించును.

'న చేయమవగతిర్నోత్పద్యతే ఇతి శక్యం వక్తుమ్ అవగతిసాధనానాం శ్రవణాదీనాం వేదానువచనాదీనాం చ విధానాత్ ॥ (సూ.భా.2.1.14) ఈ అనుభవము పుట్టుటే లేదు అనుటకు కూడా వీలులేదు. ఎందుకనగా శ్రవణము (ఆత్మవిషయమును శ్రవణము చేసివాక్యార్థమును నిశ్చయించుట) మనను (శ్రవణము చేసినది తర్క సమ్మతమైనది అని గుర్తుచేసుకొనుట), నిదిధ్యాసనము (ఆత్మ వస్తువునే ఏకాగ్రతతో చింతన చేసి దాని తత్త్వమును నిశ్చయింటుకొనుట)

- అను దృష్టఫలమును ఇచ్చుసాధనములను వేదమందు విధించియున్నది. వస్తుజ్ఞానమునకు శ్రవణాదులే కదా కావలయును. వాటినే ఇక్కడ చెప్పినది. వాటితో ఇక్కడే బ్రహ్మ ప్రాప్తి కలుగును అని స్పష్టముగా శ్రుతి చెప్పినది. వాటితో ఇక్కడే బ్రహ్మ ప్రాప్తి కలుగును అని స్పష్టముగా శ్రుతి చెప్పినది. ఈ శ్రవణాదులను చేయుటకు తగిన ప్రత్యక్‌దృష్టి మరియు అంతఃకరణసంస్కారముకూడా అక్కడ విధించినది. ఇట్లుండగా అనుభవము కలుగదు - అడునుటకు కారణమేమియులేదు.

న చేయమవగతిః అనర్థిగా భ్రాంతివాన్ ఇతి శక్యమ్‌వక్తుమ్ ! అవిద్యా నిపృత్తిఫలదర్శనాత్ ! బాధకజ్ఞానానంతరాజావాచ్ఛ ! (సూ.భా. 2.1.14) ఈ అనుభవము పుట్టిననూ ఏమి ప్రయోజనము ?లేక ఇదియూ ఒక భ్రాంతినయే కాకూడదా యేమి ! - అని శం ంచ పనిలేదు. బ్రహ్మాత్మామభవమను ఈ జ్ఞానము పుట్టినచో అవిద్య పోవుటయే ఫలము. అలిద్యయనగా దేహేంద్రియ మనస్సుల సంయోగము మనకు నిత్యముగానున్నది అను భ్రాంతి, ఈ భ్రాంతి పోయినప్పుడు అద్వీతీయుడైన నిత్యముక్తుడైన పరమాత్మే నేను అనుఫలము అనుభవమునకు వచ్చును. 'నదిని దాటిని తర్వాత తత్త్వమును తెలుపుదును' అని ఒక ధూర్తుడు చెప్పినడట. దాటిన తర్వాత .నానుదిటిపై నామమును చూడూ' అనెనట ! అనుభవము అటువంటి నిష్ప్రయోజనమైనది కాదు. సర్వ సంసారానర్థము తొలగుచ వ్యర్థమని ఎవరు చెప్పుదురు ? ఈ అనుభవము కూడా భ్రాంతి ఎందుకు కాకూడదు ? అని అనకూడగు. ఎందుకలగా అద్వీతీయ బ్రహ్మజ్ఞానపూస్త్రమైన అవగతియే దేశకాల నిమిత్తముల పరిచ్ఛేదమును భ్రాంతియని తూపించి కల్గును. అప్పుడు ఇకముందు మరియొక బాధక జ్ఞానము రావచ్చు అను శంకకు అవకాశమే ఉండదు. భోజనము తర్వాత వెంటనే అవిద్యా నివృత్తిరూపమైన ఫలము వచ్చును. అందుచేతనే భగవద్గీత దీనిని 'రాజవిద్య' యనియూ, ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తుమవ్యయమ్' అని పొగిడినది', ఈ విశేషణముల అభిప్రాయమును ఇప్పుడు విమర్శచేద్దాము. (1) 'ప్రత్యక్షావగమం' అనగా విజ్ఞానము నేరుగా

అనుభవమునకు వచ్చివేయును అని అర్థం. అందుచేత దాని విషయములో ఏ శంకయూ కలుగు వీలులేదు

(2) 'ధర్మ్యమ్' అనగా ధర్మమునకు విరుద్ధము కాదు, ఎందుకలగా, ఇది సర్వధర్మముల ఫలమయ్యే కనిపించు అనుభవమైయున్నది

(3) 'సుసుఖం కర్తుమ్' ఏ శరీర ఆయాసము లేకుండా రత్నస్వరూపమును వివేచన చేసుకొనువిధముగా తన స్వరూపమును కనుగొని తనయందే నిల్చొను అనుభవమిది,

(4) 'అవ్యయమ్' అనగా అద్వితీయపరమార్థసత్యమైయుండుటచేత స్వభావముతోనే కస్తూరి మొదలగు వాటివలె కొద్దిగా కొద్దిగా తరిగి నాశము కాదు. మరియొక దానిచేత కూడా నాశమగునను భయము ఉండునటువంటిది కాదు. తస్మాత్ సర్వదుఃఖ వినిర్ముక్తైక చైతన్యాత్మ కోహం ఇత్యేష ఆత్మానుభవః ! నచైవమ్ ఆత్మానమ్ అనుభవతః కిఞ్చదన్యత్ కృత్యమ్ అవశిష్యతే (సూ.భా.4.1.2) ఇట్లు కూటస్థమైయున్న మన స్వరూపమే అయి యుండుటచేతనూ నేరుగా అపరోక్షమే అయియుండుటవల్లనూ ఇప్పుడే ఇక్కడే అనుభవమునకు వచ్చు ఫలము కలిగినదిగా ఉన్నదియూ అద్వితీయ స్వభావమైన ఆత్మను తెలియచేయుటచే ఏ సంశయమునకు తావులేకుండా ఉన్నదియూ, దేశ కాలాది పరిచ్ఛేదములేకుండుటచేత అనంతఫలము కలగిగా ఉన్నదియూ అయిన ఈ వేద&ంత విజ్ఞానమును ఏ వివేకియైనవాడు తిరస్కరించును !

ఇక్కడ ఒక శంక కొందరికి కలుగవచ్చును. ఇట్లు మనము నిత్య శుద్ధ ముక్య స్వభవముగల అద్వితీయ బ్రహ్మాత్మతత్త్వమే అయితే మనందరికీ అవిద్య తొలగదు ఎందులకు ? మనకు మోక్షమెందుకు దొరకలేదు ? ఈ శంకకు పరహారమేమనగా అధికారిణి ప్రమితి జలకో వేదః అనినట్లు వేదప్రమాణముతో అదాకారులకు మాత్రము ఈ యదార్థ జ్ఞానము దొరుకనేగాని ఇది ఎవరికంటే వారికి దొరకదు. అమానిత్వము అగంభత్వము మొదలగు జ్ఞానసాఘనలను ఎవరు సంపాదించుకొందురో అటువంటి వారికి అవశ్యముగా దీని జ్ఞానము కలుగును.

'ఆ బ్రహ్మమే నీవై యున్నావు' అను వేదవాక్యము ఎప్పటికీ ఉన్నపరమార్థమునే ఉపదేశించుచూ ఉండినప్పటికీ, ఈ వాక్యము యొక్క అర్థమును అనుభవమునకు హొత్తుకొని చూచు అదికారమును మనము సంపాదించు కొనలేదు. ఆత్మానుభవమనునది అంగడిలో అమ్మబడు వస్తువుకాదు. అది అనుభవస్వరూపమైయుండుటచేత మిగతా అన్నిటిని విడిచి అనుభవముతోనే దానని సంపాదించుకొనవలసియున్నది. శరీరము, ప్రాణము, ఇంద్రియములు, మనస్సు - మొదలగు వాటి సంబంధముయొక్క ఏ దుఃఖములేని నిత్యచైతన్య స్వరూపమే నేను అనునదే ఆత్మానుభవము . ఇలా ఆత్మను అనుభవించువానికి మళ్ళీ చేయతగినది ఏమియూ మిగినియుండదు అని ఆచార్తులు స్పష్టముగా వ్రాసినారు.

ఇంతవరకు జరిగిన ఉపన్యాసములకు ఈ రోజు ఉపన్యాలము ఉపసంహారము గానూ తర్వాత సప్తాహ ఉపన్యాసములకు పీఠికగాను ఉన్నది. అందుచేత ఈ రోజునేను సూత్రభాష్యముద్వారా ఉదహరించిన ఆత్మానుభవవిషయమైన వాక్యముల అభిప్రాయమును మనసుకు పట్టునట్లు (తెలుసుకొనుటకు) ప్రయత్నించండి దీనిచేత అన్ని ఉపన్యాసముల ఆశయము మనస్సునందు చక్కగా నాటుకొనును. ముముక్షువులైన వారందరికి శాంకర వేదాంతముయొక్క సారమే దొరికినట్లగును.

# 16. శాస్త్రాచార్యుల ఉపదేశసారము

పరమార్థతత్త్వము చాలా సూక్ష్మమై యుండుటచేత దానిని తెలియజేయుచకుగాను స్థూలమైన కొన్ని సాధన విశేషములను పరమార్థముగానే ఉన్నట్లు పెట్టుకొనే తెలిసినారు ఉపదేశించుదురు. ఒక గొప్ప ఇంటిని కట్టునప్పుడు మొదట పరంజాను కట్టుకొని గృహనిర్మాణము మగిసిన తర్వాత దానిని తీసివేయునట్లు తత్త్వ నిర్ధారణ అయిన తర్వాత అభ్యు పగమములను తీసివేలి శుద్ధమైన తత్త్వమును శిష్యుల మనస్సునందు నిలుపుదురు. దీనిని ఇప్పుడు ఒక ఉదాహరణ ద్వారా

తెలియజేయుటకు ప్రయత్నించెదను. కఠోపనిషత్తునందు ఈ వాక్యమున్నది. ఉత్తిష్టత జాగ్రత ప్రాప్యవరాన్ని భోధత లేవండి' మేల్కొనండి, శ్రేష్టులైన సద్గురువులను చేరి తత్త్వమును తెలుసుకొనండి. ఈ వాక్యమందు శ్రుతి మన జాగ్రతను కలయునియూ దానినుండి మేల్కొని దీనికి విలక్షణమైన పరమార్థ కనుగొనవలయుననియూ చెప్పినట్లయినది. ఇదే అభిప్రాయమును శ్రీ గౌడపాదాచార్యులు "అనాది మాయయా సుప్తోయదా జీవః ప్రబుధ్యతే ! అజమనిద్రమస్వప్నమద్వైతం బుధ్యతే తదా ॥' అను కారిక ద్వారా బయట పెట్టినారు. ఇక్కడ జీవుడు అనాది మాయాస్వప్నమును అనుభవించుచున్నాడని గదా చెప్పండి దీనియందు అగ్రహణము తత్త్వమును ఎరుగక యుండుట, అన్యథాగ్రహణము (తత్త్వమును వేరోక విధముగా తప్పుగా తెలుసుకొనుట) అను రెండు విధముల స్వప్నములూ చేరుతని, జాగ్రత కల అని మనము వ్యవహరించుచున్న రెండు అవస్థల యందునూ మన స్వరూపము కంటే వేరుగా దృశ్య విశేషములున్నవని తెలియు అన్యథా గ్రహణమున్నది. క్రియాకారక ఫలరూపమైన ప్రపంచమును చూచుచుండుట అనునదే అన్యథాగ్రహణము లేక స్వప్నము అగ్రహణము అనగా ఏమియూ ఎరుగక ఉండునదే నిద్ర. ఈ రెంటిని కూడా సతతముగా అనుభవించుచున్నామని మనము స్వాభావికముగా భావించుకొనుటనే ఈ కారికల యందు అనిదా మాయయా సుప్తః అని చెప్పబడినది.

స్వప్నమందు మనము చూచుచున్నదంతయూ కల్పితమే స్వప్నమనునది. నిడముగా లేనేలేదు అని మేల్కొనిన వెంటనే మనందరికి తెలియు విషయమే అయిననూ మనము మళ్ళీ మళ్ళీ మోసపోవుచునే ఉందుము. మరియొకసారి కలవచ్చినచో దానిని జాగ్రత అనియే అప్పుడు చెలుసుకొందుము. వ్యవహారము యొక్క ఈ స్వప్నము వలె జాగ్రత, కల నిద్రలను మూడు అవస్థలూ అనాదియైన ఒక స్వప్నమైయున్నది. అని వేదాంతులు మనకు బోధించుచున్నారు. బృహదారణ్యక వార్తికమందు శ్రీ సురేశ్వరాచార్యులు వారు వ్రాసినదేమనగా ........

నాస్యసాపః ప్రబోధోవా కుతఃస్వప్నస్య సమ్భవ?
ప్రత్యక్స్వరూప ఏవ్యాస జాగ్రత్స్వ సుషుప్తయః॥
సుప్తః ప్రబుద్ధః ఇత్యేవం స్వప్నం పశ్యతిచేత్ యః!
వికల్పఏష భూతనాం అవిద్యారాత్రి శాయినామ్ ॥ (బృహ 2-1-264,265)

నిజముగా త్రాడు ఒకటే ఉండినా దానిని పాము, నీటి చార. కఱ్ఱ అని మొదలుగా వికల్పించునట్లు తనకంటే రెండవది లేని మన ఆత్మ స్వరూపమందే జాగ్రత, కల, నిద్రలను మూడు అవస్థలను జనులు వికల్పించుచున్నారు. ఈ దృష్టితో చూచినప్పుడు స్వప్నమునకూ జాగ్రతకూ ఏ భేదములేదు. స్వప్నమందు సత్యమిథ్యా విభాగములను స్థిరచర విభాగములనూ అధ్యాత్మిక (లోపల) అధి బౌతిక (బయటి) అను భేదములను చూచుచున్నట్లే జాగ్రత యందునూ జనులు చూచుచున్నారు. జాగ్రత యందున్నవారు మనకు జాగ్రత, కల నిద్రలను అవస్థలు నిరంతరముగా వచ్చుచున్నవనిభావించుకొనుచున్నట్లే కలయందునూ భావించుకొనుట యున్నది. ఇట్లుండుటచేత జాగ్రత కలనిద్రలను అవస్థల సమూహముకలిగిన ప్రపంచము తేచుచున్నది అను దానిని వదిలితే అది నిజముగా ఉన్నది అనుటకు మనకు మరి ఏయుక్తి యొక్క ఆధారమూ లేదు. కలయందు మనము నిజముగా మేల్కొనినాము. కలవలె జాగ్రత్ మిథ్యావస్థకాదు. నిద్రాదోషములో కలవచ్చును. జాగ్రత అట్లు కాదు, అని ఎంత బలముగా నమ్మికొనిననూ కలనుండి మేల్కొనినామంటే అరెరె ! ఇదంతయు ఎలాగైంది ? అని ఆశ్చర్య పడుదము. 'నహి దృష్టే అనపపన్నం నామ' అనుభవమందుకలబడుతున్న దానిని అయుక్కమని అనుట ఎప్పుడునూ సరికాదు - అను న్యాయమును మనము ఇక్కడ మనస్సుకు తెచ్చుకొన వలయును. జాగ్రత్ స్వప్న నిద్రల అనుభవము మనకు కలుగుచున్నట్లు తోచుట నిశ్చయము. ఈ అనుభవములు మనము స్వప్నమందున్నప్పుడు ఇట్లే కలుగుచున్నవి అని గట్టిగా భావించుటయూ నిశ్చయము. శ్రుతి ఉతిష్టత, జాగ్రత లేవండి మేల్కొనండి అని మరి మరి భేరి మ్రోగించినట్లు చెప్పుచున్ననూ మనము అవస్థాత్రయ ప్రపంచము సత్యమను

నమ్మికను వీడుట లేదు.

సన్నిపాతము వచ్చిన వారికి ఏవేవో దృశ్యములు కనబడును. అప్పుడు వారు మేల్కొనియే ఉన్నామనియూ ఈ దృశ్యము లన్నియూ నిశ్చయముగా ఉండే ఉన్నవనీయూ గట్టిగా నమ్ము కొందురు. మనము మాట్లాడే మాటలు కూడా వారికి వినబడుచుండును. అయితే తమ అనుభవము యదార్థమను దృఢభావనయూ వారిని పట్టుకొని ఉండును. ఇట్లే మనకు నిరంతరముగా జాగ్రత్ స్వప్న సుషుప్తులు ఒకదాని వెనుక ఒకటి కలుగుచున్నవనియు మనము గట్టిగా నమ్ముకొను చున్నాము. పరమార్థమును తెలిసిన వేదాంతులు ఇదంతయూ స్వప్నము లేవండి, మేల్కొనండి ! అని గట్టిగా చెప్పుచున్ననూ ఇంత స్పష్టముగా అందరికీ కలుగుచున్న ఈ అవస్థలూ మరియు ఈ ప్రపంచమూ మిథ్య అనవచ్చునా ? వీరికి సన్నిపాతమైపిచ్చో ! ఏదో మనస్సు యొక్క వికారము కావలయును అనుకొను మన నమ్మిక యందు మనము గట్టిగా నిలిచి యుందును. ఇక్కడ ,న్నిపాతము లేక పిచ్చి ఏవరికి ? వారికా? మనకా? ఇది ఇప్పుడు ప్రశ్న.

తత్త్వ విచారకులు పరమార్థము యొక్క విచారమును చేసి తమతమ సిద్ధంతమును మనముందే రెట్టుచున్నారు. ఇలాగని హేగల్ అను పాశ్చాత్య విద్వాంసుడు చెప్పినాడు. ఇలాగని క్యాంట్ అను నాతడు చెప్పినాడు. ఇట్లని రసల్ అనునాతడు చెప్పినాడు. శంకరాచార్యులు ఇలాగని చెప్పినారు. " అంటున్నాము, కదా :ఇదంతయూ స్వప్నమేనా ! మనము ఇక్కడ చూచుచున్నాము. వినుచున్నాము, విచారము చేయుచున్నాముతత్త్వనిర్థాకణ చేయుచున్నాము. ఇదంతయూ మన వికల్ప మాత్రమా ? ఏకమేవాద్వితీయంబ్రహ్మ అని శ్రుతిచెప్పుటయూ మనకు వినిపించును. అయితే మనందరికి కనిపించుచున్న ఈద్వేత ప్రపంచము మిథ్యయా ? అనేకజనులు ఒప్పుకొనిన ప్రపంచసత్యత్వ వాదమును సరి అనవలయులో ఎక్కడో ఒకరు లేక శ్రుతి చెప్పు అద్వైతమే పరమార్థ మనవలయునో ! అనుశంకమనయందు కొందరిని చికాకువెట్టును అయిత్ చాలామంది (Majority)తో తత్త్వమును నిర్ణయించుట సరియేనా ! జ్వరముతో

బాధపడు రోగులు చాలామంది చేరి పెరుగన్నమును తినుట తప్పేమియు కాదు. అది శరీరమునకు చల్లదనము కలుగజైయుట మన అనుభవమందున్నది. ఇట్లే అరటి పండుల& కావలసినన్ని తినవచ్చు అని నిర్ణయించినారను కారణముతో రోగి కానటువంటి వైద్యుడు ఆతీర్మానమునే సరియని ఒప్పుకొనవచ్చునా ? దీనిని మనము మనసు పెట్టి ఆలేచించుట మంచిది.

ఇత్తిష్టత జాగ్రత ఇదంతయూ స్వప్నమని తెలియండి, ఏదోషము యొక్క కళంకమునూ కల్పించుటకు వీలు లేని శ్రుతియూ, పరోపకారమున కని సర్వానుభవ సిద్ధమైన తత్త్వమును ఉపదేశించుచున్న ఆచార్యులు బుద్ధిచెడినవారనిగాని సావర్థమునకు గాను ఇట్లు ఉపదేశించు చున్నారనిగాని కల్పించుట ఎప్పుడూ మనకు హితకారి కాజాలదు. స్వప్నమునకూ జాగ్రతకూ చెప్పుట సరికాదు అని కల్పించుట ఎప్పుడూ తత్త్వ పక్షపాతులకు యుక్తమనిపించదు.

సరి, అలాగయినచో ఈ ప్రపంచము మనందకి అనుభవమందు ఉండే యుండుటచేత ఈ ద్వైతమున్నంతవరకైనా అద్వైతమును పరమార్థమని నమ్ముటకు వీలు కాదుకదా ? అని ఎవరైననూ అడుగవచ్చు. దీనికి సమాధానము గౌడరాదాచార్యులు ఈ కారికను వ్రాసినారు-

ప్రపంచోయది విద్యేత నివరేంతనశంసయః।

మాయామాత్రమిదంద్వైత అద్వైతం పరమార్థతః॥ గౌ.కా1.17

జాగ్రత్స్వప్న సుషుప్త ప్రపంచము అనాది మాయాస్వప్న మాత్రమను దానిని సార్వకానువభవానులవలె సారియైనవిచారముతె నిశ్చయించుకొని తరువాత కూడా ఇట్లు శంకనుచేయుట సరికాదు. మనము కలనుచూచుట నిజము. అంతమాత్రముతో కల నమ్ముదురా? త్రాడును పామని మనము భ్రాంతితో కొద్దిపాటి సమయము తెలిసికొనినంత మాత్రమున ఆ పాము త్రాడుయందుగాని మనస్సుయందుకాని నిజముగా పుట్టి భ్రాంతిపోయిన తర్వాత తాను తొలగినదని ఎవరైనా ఒప్పుకొందురా ? త్రాడునందు పాము అప్పుడు నిజముగా ఉండెడిగి. చేతిదీపము తీసుకొనిరాగానే అది కనిపించకపోఘువుటచే అది ఏదో ఒక

బిలములోనికి దూరిపోయి ఉండవచ్చును, అని ఎవరునూ ఎప్పటికీనీ భావించరుగదా? అది ఒట్టి మిధ్యే, నిజముగా ఎప్పుడూకూడా త్రాడొక్కటే ఉండేది - అని సామాన్యజనులుకూడా తెలుసుతొనుచున్నారూ కదా ? ఇప్పటి శంకరఅనుయాయులను కొందరు టీకాకారులు పాముయొక్క భ్రాంతికాలమునకు 'ప్రాతిభాసిక' సర్వ మొకటి పుట్టినదని వాదించుదురు. ఈ మధ్య ఒక సన్యాసివారు "Methods of knowledge" జ్ఞానప్రకారములు అను గ్రంథమొకదానిని వ్రాసి ప్రాజిభాసిక పదార్ధము భ్రాంతి కాలమునకు నిజముగా పుట్టునను వాదనకే ఎక్కువబలము కలిగించినారు వీరు అమెరికాయందు రామకృష్ణమిషన్ పరముగా ఒకసంస్థను స్థాపించినారు. వారి ఈ క్రొత్త గ్రంథము ఇంగ్లండ్‌నందు అచ్చుయినది, ఇంగ్లండ్, అమెరికా దేశములలో నున్నతత్త్వవిచారుకులు ఈ నవీన వేదాంతవాదనను విని తలలూపుదురో లేక ఇదే కదా, వేదాంతము ! అని నవ్వుదురో నాకు తెలియదు. ఇది ఇటుంచండి తాచు పాము సత్తయితే బాధితము కాకయుండెడిది. అసత్తయితే తోచక యుండెడిది. అందుచేత అది సదసద్విరక్షణమైన అనిర్వచనీయ సర్పము అనునగి నవీన వేదాంతుల తర్కము ! ఇది మీరందరు సమ్మతించెదరా? మీలో మీరు విచారించుకొండి!

ఇది ఇటుంచండి, ప్రపంచము 'మాయమాత్రము' వట్టి మిధ్యాభాసము. ఇది వచ్చుటయూలేదు, పోవుటయూలేదు, అందుచేత ఇది ఉన్నంతవరకు అద్వైతమే లేదు. అనునది అనుభవ విరుద్ధమైన యుక్తి, ప్రపంచమనునది నిజముగా యుండి అద్వైత జ్ఞానముతో పోవునని వేదాంతుల అభిప్రాయముకాదు. అయితే మన వ్యవహారము యొక్క జ్ఞానము ప్రకారము ప్రంచమనునదే సత్యము. దీనికంటే వ్యతిరిక్తమైన బ్రహ్మమును మన మెరుగము. శ్రుతియూ, గురువులూ మనకు తత్త్వమును అనుభవమునకు తెచ్చుకొను ఉపదేశము చేసినతరువాత వారికంటితో చూచినప్పుడు ప్రపంచమనునది ఎప్పుడూ లేనేలేదు. అంతేకాదు గురు, శిష్య, శాస్త్రవిభాగము నిజముగా లేనేలేదు. గౌడపాదులు చెప్పినట్లు - వికల్పో వినివర్తేత

కల్పితో యదికేనచిత్ ! ఉపదేశాదయం వాదో జ్ఞాతేద్వైతం నవిద్యతే ॥ (గౌకా - 1.18) ప్రపంచము, గురువు శిష్యుడు మొదలగునవన్నియును వికల్పమాత్రమైయుండుటవల్ల ఎవరో ఒకరు ఈ వికల్పములను చేసికొనినారు అని భావించకూడదు. లోకప్రసిద్ధమగు ఈవికల్పములను ఉపదేశమునకుగాను వేదాంతమందు ఉపయోగించుకొని తత్త్వమును తెలియజేయడమైనది. ఎవరు నిజమును ఉన్నది ఉన్నట్లు అనుభవమునకు తెచ్చుకొందురో వారి దృష్టితో ఏద్వేతమూ ఎప్పుడూ లేనేలేదు. అద్వైతమొకటే పరమార్థము.

# 17. బ్రహ్మాత్మ విజ్ఞానము

'జ్ఞాతే ద్వైతం నవిద్యతే ' (తెలిసికొనిచో ద్వైతము లేనేలేదు) అను అభియుక్తుల వచనము మనసుకు తెచ్చుకుంటే ఉన్నదంతయూ ఒకేఒక అద్వీతీయ వస్తువు అని ఏర్పడును. అందుచేత దానిని తెలిసికొనినచో అన్నిటినీ తెలుసుకొనినట్లగును. అని స్వయంగా సిద్ధమగును దీనిని తెలుసుకొనుటకుగానే ముండకోపనిత్తునందు 'కస్మిన్ను భగవొజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతి ' పూజ్యుడా ! ఏ ఒక్కదానిని తెలుసుకొంటే ఇదంతయూ తెలిసికొనినట్లు అగును ? అని శైనకుడు అంగీరసునిని అడిగినదని చెప్పినది.

ఇక్కడ తెలిసికొనుట అంటే ఏమి ? లోకమందు జనులు ఒక్కొక్క విషయమును వేరువేరుగా ఎరుగు ప్రకారముగా ఈపరతత్త్వమును తెలుసుకొనుటయని అర్థిమా ? ఇంద్రియములందు ఏదోఒక దానితో విషయమును చూచి మనము ఎరుగు నప్పుడు మనస్సునందు ఒక వికారము కలుగును. ఆ మనస్సుతో మనము వస్తువులను ఎరుగునపుడు ఒక్కొక్క వస్తువును ఎరుగునప్పుడు కూడా మనపూర్తి మనస్సే వినియుక్తమగును. అదేకానమునకు మరి ఏ పదార్థమును తెలియుట మనస్సుకు శక్యముకాక పోవును. ఇంకొక వస్తువును తెలిసికొనవలెనని ప్రకృత విషయమును వదలియే ఆ క్రొత్తవస్తువును మనస్సు

వ్యాపించుకొనవలసి యున్నది. ఆత్మను ఎరుగునప్పుడు విషయమును ఎరుగునప్పుడు విషయాకార వృత్తిఏర్పడునట్లు ఆత్మాకారమైన వృత్తి ఏర్పడునా ? దీనిని విచారము చేయవలయును.

మీమాంసకుల దృష్టియందు విషయాకార వృత్తి కలుగపోతే విషయము యొక్క జ్ఞానము కలుగదు. ఇది నిజమైతే ఆత్మను ఎరుగుటకు ఆత్మాకార వృత్తికావలయును కదా ? మీమాంసకులు ఆత్మను అహంప్రత్యయగమ్యుడని చెప్పుటకు ఇదే కారణము కావచ్చును. అయితే నిజముగా ఆత్మ అహంప్రత్యయగమ్యుడుకాదు. వ్యవహారమందు కర్తృరూపమైన ఆత్మ నిడమైన ఆత్మయొక్క ఒక సోపాధిక రూపము మాత్రమే. అందుచేతనే ఆత్మయొక్క పరమార్థ స్వరూపమును చూపు సందర్బము నందు భగవంతుడు "య ఏనం వేత్తి హన్తారం, యశ్చైనం మన్యతే హతమ్ ! ఉబౌతౌ న విజానీతో నాయంహన్నిన హన్యతే ॥ (2-19), ఈ ఆత్మ ఏక్రియకుకర్తకాడు, కర్మయూకాడు ఎందుకనగా ఈయన అహంప్రత్యయమునకు విషయుడు కానేకాడు - అని స్పష్టముగా చెప్పినాడు. అందుచేతనే పరమార్థ స్వరూపమైన - అపరిచ్ఛిన్నమైన ఆత్మను ఎరుగుట యనగా విషంమును ఎరిగినట్లు ఆత్మాకారమైన ప్రత్యయమును చేసుకొనుటకాదని ఏర్పడినది. జ్ఞాతయైన ఆత్మ నిజముగా ఏప్రత్యయయనకు విషయము కాదు. ఆయనను అహంప్రత్యయమునకు విషయమని చెప్పినదియు చివరికూట కాదను నది జ్ఞాతయొక్క స్వరూపమును మనస్సుకు తెచ్చుకొనుటకు రాకపోవుటచేతనే తెయలినగును. ఎలాగనగా జ్ఞాతయూ అయిఉండి జ్ఞేయమయి ఉన్నాడనునది తనకు తానే విరుద్ధమయి యున్నది. ఇలాగున్ననూ వ్యవహారమందు, నాస్వభావము ఇలాగున్నది అనునది నాకు తెలియదా ? అని తమకు తామే విషయమైనట్లు అహంప్రత్యయము యొక్క బలముతో కల్పించుకొనుచుండుటచేత మీమాంసకుల మతమును అధ్యారోపదృష్టితో వేదాంతమందునూ ఒప్పుకున్నది. జ్ఞాత తనకు ఏవిషయమునూ కల్పించుకొనక జ్ఞానయే కాజాలకపోవుటచేత తనకు తానే విషయుడైనట్లు వ్యవహారమందు కల్పించుకొనుచున్నాడు. అంతే అయితే అప్పుడు

కూడా అతనికి తన జ్ఞాతృ స్వరూపమును విడుచుటకు వీలేలేదు. అయితే పరమార్థత్మ జ్ఞాతృ స్వరూపుడే అయియున్నాడను నియమేమియు లేదు. ఉదాహరణకు సుషుప్తి యందును ఆత్మ ఉన్నాడు. అయితే అక్కడ ఆయన జ్ఞాతృ స్వరూపుడై లేడు.

ఇప్పుడు ఈ అనుభవరూపమైన శుద్ధాత్మనూ తెలుసుకొన వలయునని అతని యందే మన మనస్సును పెట్టినచో ఏమి కలుగునో చూద్దాము. జ్ఞాతను ఎరుగుటకు పోయినచో కల్పితముగా కూడా ఉండుటకు అవకాశము లేదు. సుషుప్తి యందున్న ఆత్మ స్వరూపము ఇలాగున్నది అని ఎరుగుటకు మనము మనస్సును ఏకాగ్రత చేసినట్లయితే అప్పుడు అది ఆ ఆత్మవలెనే తాను అయిపోవలసినదగును. (అయిపోవును ) అనగా తన మనస్సుతనమునే పోగొట్టుకొనును మనస్సు ఏ విషయమును తెలుసుకొనుటకు పోయిననూ దాని అదారము కలిగిన వృత్తిని చేసికొనవలసినదిగానున్నది కదా! ప్రస్తుతము ఆత్మకు ఏ ఆకారమూ ఉండనే ఉండక పోవుటచేత మనస్సు కూడా ఆత్మవలెఅగనట. అనగా నిరాకారముగానే కలుగవలసియున్నది. ఆత్మనే ధాయనించుచున్న మనస్సు - ఏవం యోగాభ్యాస బలాత్ యోగిన ఆత్మన్యేవ ప్రశామ్యతి మనః ఇట్లు ధ్యానము చేయువాని మనస్సు ఆత్మయందే ప్రశాంతమయిపోవును (గీ.భా.6.26) అని శంకరాచార్యులు వ్రాసినారు. ఆత్మస్వరూపము మనస్సును కూడా చూచుచున్న సాక్షియగుటచేత ఈ రహస్యమును ఎరిగి తన స్వరూపముతో చూచు చున్న వానికి ఈ ధ్యానము కూడా అక్కరలేదు. ఆత్మ నవలంబించియే మనస్సు కనబడును. ఆత్మతోనే అది పూర్ణముగా వ్యాప్తమయినది అను అనుభవము వచ్చి. అంతయూ ఆత్మే - అనే అనుభవ మందు తోచును (కనబడును) ఇట్లనే గైడ పాదాచార్యులు " ఆత్మ సత్యానుబోదే న సంకల్పయతే యదా ! అమనస్తాంతదా యాతి గ్రాహ్యా భావే తదగ్రహమ్ " (గౌ.కా.3.32) అను కారిక యందు వ్రాసినారు. ఆత్మయొక్కడే పరమార్ద సత్యము. ఆయన కంటే వేరుగా ఏవియూలేదు - అను తత్త్వమును శాస్త్రా చార్యుల బోధతో అనుభవమునకు తెచ్చుకొను సమయమునకు తనకు

విషయమే లేక పోవుటచేత ఏమియూ విషయీకరించుకొని ఏరుగవలసినది ఉ ండక పోవుటచేత మనస్సు అమనస్సు అగును. అని వివరించినారు.

ఇక్కడ రహస్యమేమనగా మనము ఎప్పుడునూ అనుభవ స్వరూపమైన ఆత్మే అయిఉన్నాము. ఇది ఎప్పుడు మనకు తెలియునో అప్పుడు
ఆత్మానుభవమయినది. అందురు. సుషుప్తి యందు ఆత్మయొక్కడే యుండును. అప్పుడు ఆత్మ ఏమియునూ ఎరుగడు. కేవల చైతన్య (అనుభవ) స్వరూపముగా ఉండి ఉండును. ఆ చైతన్య స్వరూపమే జాగ్రత్స్వప్నముల యందంతటను ఉ న్నది. ఆ పరమాత్మ స్వరూపమును ఎరుగవలెనని అంతఃకరణ వృత్తి ప్రయత్నించునప్పుడు అది బ్రహ్మయే అయిపోవును. మనస్సు ఆత్మాకారమైన వృత్తియొక్క రూపమును ధరించునని కొందరు వేదాంతులు చెప్పుచున్న మాటకు అర్ధము లేదు. ఎందుకలగా ఆత్మకు ఆకారమే లేదు ధ్యానయోగము ద్వారా మనస్సు ఆత్మయందు మునిగిపోవుటనే "ఆత్మాకారవృత్తి" అని ఉపచారమునకు పిలువవచ్చు. బుద్ధి ఆత్మవలె నిర్మలముగా స్వచ్ఛముగా సూక్ష్మమగుటనే ఆత్మాకారమును పొందినదని చెలియ వలయును. సాంఖ్య విచారక్రమము అధ్యారోపితమైన అనాత్మను తీసివేసిననూ ధ్యానయోగముతో ఇంద్రియములు మనస్సు మొదలగు వాటి వ్యాపారమును నిలిపి ఆత్మయందే శాంతమైనచో ఆత్మానుభవము స్వయంగా అభివ్యక్తమయిపోవును. "ఏకస్మిన్ విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతంభవతి అనగా ఆత్మయొక్క అనుభవము కలిగితే, మనస్సు అమనస్సుగా ఆత్మే అయిపోయినచో ఆత్మే అంతటనూ ఉన్నవాడూ అతనికంటే వేరు ఏదియూలేదు. అని ణిశ&్చయమయి పోవును. ఈ జ్ఞానమందు మనము జ్ఞాతలుగా వృత్తిరూపముతో ఉండి జ్ఞేయమును ఎరుగుటయను రూపముగల జ్ఞాలమొకటి వేరుగా నున్నదని చెలియుట శక్యమేకాదు. ఆత్మ స్వరూపమందే నిల్చోనినవారికి ఆత్మజ్ఞానమునకు మరేమియూ అక్కరనే లేదు. సర్వసాక్షియైన ఆత్మానుభవమే నిజముగా అన్నిటినీ వ్యాపించుకొని యున్నది. అదే పరమార్ధమను దానిని నేరుగా తెలియుట ఉత్తమాధికారులకు సాధ్యము. ఇది సాధ్యముకాని వారు అవస్థాత్రయ

విచారముతోనో మరి ఏ ఒక్క ప్రక్రియతోనో ఇదే అనుభవమును తెచ్చుకొనవలయును.

ఎవరికి ప్రత్యగ్దృష్టి అలవడియుండులో వారు సాంఖ్యదృష్టి యొక్క విచారము అవస్థాత్రయ పరిశీలన లేక ధ్యానయోగము ఈ మూటియందు ఒక మార్గముద్వారా ఆత్మ స్వరూపమును అనుభవమునకు తెచ్చుకొనవచ్చు. ఈ అనుభవమునే బ్రహ్మాత్మ విజ్ఞానమని పిలుచుదురు.

# 18. సద్విజ్ఞానం ద్వారా సత్సంపత్తి

ఛాందోగ్యోపనిషత్తునందు తత్త్వమని అమ (అదే నీవై యున్నావు) అను వాక్యము ఒకటి యున్నది. ఇప్పటికీ అనేకమంది వేదాంతులు ఇదోక మహావాక్యమనియు దీనిని సన్యాసులు జపమునకు పెట్టుకొన వలయుననియు చెప్పు దురు. కొందరైతే ఈ వాక్యము యొక్క అర్థమందే సమాధి అనుభవము రావలయును. అట్లే సమాధిని తెచ్చుకొనిన తర్వాత కూడా వ్యవహార భూమికి దిగివచ్చిన మహాత్ములే జీవన్ముక్తులకు ఉదాహరణగా ఉందురు అని అనుచున్నారు.

నిజముగా ఈ వాక్యము ఉదాదక్రుడను నతడు తన పుత్రుడైన శ్వేత కేతువుకు చేసిన తత్త్వోప దేశమందు మరల మరల వచ్చినది. పూర్ణవాక్యము ఇట్లున్నది. సయఏషో ణిమైత దాత్మ్య మిద్ సర్వం తత్సత్యం స ఆత్మ తత్త్వమని శ్వేతకేతో (చాం6-8-7) ఈ పరమ సూక్ష్మమైన తత్త్వమున్నది కదా, దాని సావరూపమే ఈ జగత్తంతయూ, అదే సత్యము, అదే ఆత్మ : శ్వేత కేతూ, అదే నీవైయున్నావు అను నది వాక్యము యొక్క అక్షరార్థాము.

శ్వేతకేతువు పన్నెండు సంవత్సరముల వరకు గురువులవాసమును చేసి సర్వవేదములను అధ్యయనము చేసి తనకంటే జ్ఞానమునందు ఎమరునూ ఎక్కువైలేరు. అను గర్వమును పొంది ఇంటికి వచ్చెను. తండ్రి అతనిని చూచి నాయనా శ్వేతకేతూ ? ఏ ఒక్కదానిని తెలుసుకొనినచో శ్రవణము చేయనిది

చేసినట్లగునో మననము చేయక యున్నది మననము చేసినట్లగునో తెలుసుకొనకయున్నది తెలుసు కొనినట్లగునో ఆ ఆదేశమును - ఆ ఉ పదేశమాత్రముతో, గమ్యమైన తత్త్వమును గురువులవద్ద అడిగి చెలుసుకొని వచ్చితివా ? అని అడిదెను. పుత్రుడు ఇటువంటి అద్భుతమైన వస్తుజ్ఞానము ఏమైయుండును ? అని ఆశ్చర్యముతో ఆ ఉపదేశము ఏవిధముగా నుండును? అని అడిగెచు. తండ్రి కుమారునికి ఒక దృష్టాంతముతో తత్త్వజ్ఞానము యొక్క రీతిని విశదీకరించెను. యధా సోమ్యేకేన మృతిండేన సర్వం మృణ్మయం విజ్ఞాతం స్వాత్ వాచారంభరణం వికారోనామధేయమ్ మృత్త్యేవ సత్యమ్' (ఛాం.6.1.4) 'మట్టిముద్దయొక్క దానిని తెలుసుకొనుటవలన ఎట్లు మట్టియొక్క కార్యములన్నిటినీ తెలుసుకొనినట్లగునె, ఎట్లు కార్యమనునది మాటతో కలిగిన పేరే అయిఉన్నదో, మట్టి యనునదే ,త్యమో అట్లే. ఇట్లే బంగారపు ముక్కలు, గోళ్లు కత్తిరించు కత్తి అను రెండు దృష్టాంతములను చెప్పినాడు. సరిగా చూచినచో ఇక్కడ దృష్టా ంతమందే ఉద్ధాలకుడు చెప్పవలయుననుకొనిన తత్త్వముకూడా ఇమిడి యున్నది : మరి దానికి యుక్తిని కూడా ఇయ్యవలసినదిలేదు. ఎందుకనగా మట్టి మొదలగు ఉపాదాన కారణమే కుండ, ముకుడు - మొదలగు కార్యరూపముతో కనిపించుచున్నది. మట్టికంటే వేరుగా కుండ మొదలగు కార్యములు లేనేలేవు 'సదేవసోమ్యేదమగ్ర ఆసీదేకమేవాద్వితీయమ్' తనకంటే రెండవదిలేని సత్తు (వట్టి ఉనికి) ఒకటే మెదలు ఉండినది : ఇప్పుడుకూడా అదోక్కటే ఉన్నది మట్టినుండి కుండ మూకుడు మొదలగునవి కలుగునని తెచువిధంగా సన్మాత్రమైన పరమార్ధమునుండే ఈజగత్తంతయూ కలుగుచున్నట్లు తెచుచున్నది, అనునదే ఈ దృష్టాంతము ఇచ్చినారు, 'రూపకార్యసమాఖ్యాశ్చ భిద్యన్తైత్రవై! అకాశస్యన భేదో స్తి తద్వజ్జీవేషు నిర్ణయః ॥ (గౌ.కా3-6) రూపము, కార్యము, నామము - ఇవి ఒక్కొక్క వస్తువురు ఒక్కొక్కటి ఉన్ననూ మాటన్నిటియందును అకాశము ఒకటే ఉన్నట్లు, అవన్నియూ ఆకాశముయొక్క కార్యమే అయియుండుటచేత జీవులు వేరువేరుగా తోచుచున్నారు నిజముగా

అందరికీ ఒక్కడే ఆత్మ - అన్ని వస్తువులు ఆకాశము సద్రూపమైన ఆత్మకంటే వేరుగాలేదు - అన్ని దృశ్యముల యందునూ సద్బుద్ధి అనిగతమయ్యే యుండును. అందుచేత సన్మాత్రమే అన్ని దృశ్యముల రూపములతోనూ తోచుచున్నది. సన్మాత్రమే ఇది అనుభవమునందే యున్నది.

సత్ (వట్టి ఉనికి) అనగానేమి ? సదితి అస్తితా మాత్రం వస్తు సూక్ష్మం నిర్విశేషం సర్వగతమ్ ఏకం నిరంజనం నిరవయవం విజ్ఞానం యదవగమ్యతే సర్వవేదాన్తేభ్యంః॥ సత్ అనునది వట్టి ఉనికి రూపమందున్న వస్తువు. అన్నింటికంటెనూ సూక్ష్మముగా జాతి ద్రవ్యగుణాదులైన ఏ విశేషమూ లేని సర్వగతమైన ఒకే ఒకఅసంగమైన సర్వవేదాంత వేద్యమైన అనుభవాత్మమైన వస్తువు అనియూ శంకరాచార్యులు ఛాందోగ్య భాష్యమందు వివరించినారు. ఇటువంటి వస్తువుయొక్క అనుభవము మనకు ఎక్కడ కలుగును ! అని అడుగవలసిన పని లేదు. అది మనందరి సుషుప్తియందు (గాఢనిద్రయందు) మన స్వరూపమే అయి కనపడును. ఉద్దాలకుడు ఈ అవస్థయందు ఆత్మ మాత్రము ఉన్నాడను దానిని జ్ఞప్తికి తెచ్చుకొనుటకు గాను "స్వపితి" (నిద్రించుచున్నాడు) అను సంస్కృత శబ్దమువైపు పుత్రుని చిత్తమును మరలించినాడు. యత్రైతత్పురుషః స్వపిత నామ సతా సోమ్య తదా సంపన్నో భవతి స్వమపీతో భవతి (నిద్రించుతాడు) తస్మాదేనం స్వపితీత్యా చక్షతే స్వంహ్యపితో భవతి మనుష్యుడు స్వపతి అందురు కదా, అప్పుడు ఈ సద్వస్తువుతోనే ఒకటైపోవును. ఆ సద్వస్తువు తన స్వరూపమే అయి యుండుటచేత స్వపితి అందురు. స్వమ్ (తన రూపమునే) కదా, అప్పుడు చేరికొనును? అని ఉద్దాలకుని వాక్యము యొక్క అర్థము.

ఇప్పుడుకూడా మనము మన స్వరూపమందే ఉన్నాము. అయితే మనకు ఇప్పుడు శరీరము ఇంద్రియములు, మనస్సు - మొదలగు ఉపాధులు కుడాచేరుకొనినవి, బయట వస్తువులను కరణములతో ఎరుగుటయును విశేషజ్ఞానము కూడా ఉన్నది. అందుచేత వట్టి మన స్వరుపమందేకాక మరియొక అగంతుక రూపముతోనూ ఉన్నాము. ఈ ఆగంతుక రూపముండుటచేతనే మనము

'జీవులు' అనిపించుకొందుము. అయితే సుషుప్తియందు వట్టి (గాఢ) నిద్ర అవస్థయందు - మనకు శబ్దాది విషయముల అనుభవముండదు. శరీరముగాని, ఇంద్రియములుగాని మనస్సుగాని చేరి యుండదు. అప్పుడు మనము ఇది ఇటువంటిది అనురూపముతో చూచుట వినుట వాసన చూచుట తాకుట రుచిచూచుట అను విశేషజ్ఞానము కలవారుగా యుండము. వట్టి నిర్విశేషమైన సన్మాత్రమైన (ఉనికియొక్క) చైతన్యమాత్రరూపముతోనే ఉంటాము. ఆ చైతన్యము యొక్క అనుభవము తోనే మనకు ఇంతవరకు నిద్రించితిమి అను జ్ఞప్తి మేల్కొనిన వెంటనే కలుగును.

అయితే మనకు జాగ్రతు నందు వస్తువులను చూచుట చేత, వినుట చేత వ్సన చూచుటచేత తాకుటచేత లేక రుచి చూచుటచేత ఆ బయటి వస్తువులు నిజముగా ఉన్నవి అను నమ్మిక ఉన్నది. గాఢ నిద్రయందున్న మన అనుభల రూపమైన ఆత్మను మనము ఇట్లు చూచుట లేదు. వినుట లేదు. తాకుటలేదు. రుచి చూచుటయూలేదు. అందుచేతనే సుషుప్తియందు ఏమీలేదు. అక్కడమనకు నేను అనిగాని మనకంటే వేరైన దృశ్యముసు అని గాని ఏమియూ చూడకనే ఉంటున్నాము అనే వ్యవహరించుచున్నాము. అయితే నిజమేమి ? మనమే అక్కడ లేమనా? అలాగని ఏ ఒక్కరూ ఒప్పుకొనరు. చూచుట వినుట వాసనచూచూట మొదలగువాటికి విషయమయి ఉంటే నిజముగా ఉన్నది అము అభిప్రాయము మనయందు వేళ్ళు పాతుకు పోయి యుండుటకు బయటి ప్రమేయపదార్థములయందే మనమనస్సు పెట్టుకొని యుండుటె కారణము. మనము శరీరేంద్రియ సంఘాత స్వరూపులమే అను అభిమానము వ్యవహారమునందు మనమను వెన్నాడుచునే (వెంట వదలక) యున్నది.

అందుచేత మనమే సుషుప్తియందు లేము అనిననూ ఒప్పుకొనుటకు సిద్ధమై యున్నాము. సరిగా చూచినచో సుషుప్తి యందు మన స్వరూపమే లేనిదైనచో ఎవరు మాత్రము నిద్రను కోరుకొందురు. నిజమేమనగా అక్కడ జీవుడు స్వపితి (నిద్రించుచున్నాడుఢ అనగా స్వమ్ అపిత తన పరమార్థస్వరూపమందు

నయమగుచున్నాడు. సతాసోమ్యతదా సంపన్నో భవతి అప్పుడు సద్రూపమైన మన పరమార్థస్వరూపమందే కలిసి ఒకటిగా అవుతాడు. నిజమైన అర్థమందు తానొక్కడే ఉన్న సద్బ్రహ్మ యందు చేయున్నప్పుడే మనము లేమని తెలియుట ఎంత మూర్ఖతనము !

అట్లాగయితే సుషుప్తియందు మనము సద్బ్రహ్మయందే కలియుచున్నాము, అను జ్ఞానము మనకు అప్పుడు ఎందుకు కలుగుట లేదు. అనగా దానికి ఉదాలకుడు ఈ సమాధానము ఇచ్చినాడు.

" యధా సోమ్య మధు మధుకృతో నిస్తిష్ఠంతి నానాయత్యయానామ్ వృక్షాణం రసాన్ నమవహారమేకతాం రసం గమయంతితే యధాతత్ర సతివేకం లభన్తేక ముష్యాహం వృక్షస్య రస్త్యోస్మ్యం ముష్యాహం వృక్షస్య రస్యోస్మిత్యేవమేవఖలు సోమ్యేమాః సర్వాః ప్రజాః సంపధ్యన విదుః సతి సంపధ్యామహఇతే॥" (చాం 6-9-1,2)

తేనేటీగలు వేరు వేరు చెట్ల పూల రసమును తెచ్చి తేనే చేస్తాయి. అయితే యొత్తం తేనె యందు ఇది ఈ పూవుయొక్క రసము ఇది ఈ పువ్వు రసము అని రసములు వేరు వేరుగా తెలియవు. అంతయూ తేనెయే అయిపోయి ఉండును కదా? ఇలాగే నేను ఇటు వంటి వాడను అను జ్ఞానము వీరు ఇటువంటి వారు అను విడిజ్ఞానముతో విడివడి వ్యవహారమందు తెలియవచ్చిననూ సుషుప్తి యందు మాత్రము ఈ విడివిడి ప్రాణులు మరియు మన ఉపాధులు లేక పోవుట చేతనూ అన్నియూ ఒకే ఆత్మ స్వరూపమై పోవుటచేతనూ నేను, వీరు, మరియొకరు అను విశేష జ్ఞానము కల్గు వీలు లేదు. ఎప్పుడును మన స్వరూపమే అయివున్న సద్రూపమందు చేరిపోయి ఉన్నాయి. ఇట్లు చేరియుండుట అత్యంత అనందముగల అనుభవముగుటచేతనే మనము నిద్రకు పరిగెత్తుదుము. చక్కగా నిద్రపట్టవలయునని దానికోసం మెత్తని పరుపు తలదిండు, మంచి దుప్పటి - మొదలగు సాధనములను ఏర్పరచుకొందుము.

సుషుప్తియందు మనము ఆ సద్రూహ మందు ఏకీభూతుల మగుదుము. అప్పుడు దానిని ఎరుగుటకు ఇంద్రియములుగాని మనస్సుగాని లేకపోవుట చేత

ఆరూపమందున్నామని తెలిసికొనుటకు వీలులేక పోయినది - అనియే కానివ్వండి. అయితే ఇప్పుడు మనకు రీశరేంద్రియము లన్నియూ ఉన్నవికదా ! మేల్కొనినప్పుడైననూ మనతు నిద్రయందు ఇట్లు మ సద్రుపమందున్నాము. ఇప్పుడు అక్కడ నుండి ఈ స్థితిక& వచ్చినాము అనైననూ ఎందుకు తెలియరాదు? వనేను ఈ ఇంటినుండి ఈ వల్లెకు వచ్చినాను అని వచ్చినవానికి గుర్తగునట్లు (తెలియునట్లు) నేను సద్బ్రహ్మ నుండి వచ్చినాను అని ఎందుకు తెలియరాదు ? - అని అడిగినచో దానికి సమాధానమిది -

ఇమా ః సోమ్యనద్య ః పురస్తాత్ప్రాచ్యః స్యన్దంతే పశ్చాత్ప్రతీ చ్యస్తా ః సముద్రాత్స ముద్రమేవాపియన్తిస సముద్ర ఏవ భవతి తాయథా తత్రన విదురియ మహామస్మీయ మహస్మీతి ॥ ఏవమేవ ఖలు సోమ్యేమా ః సర్వాః ప్రజా ః సత ఆగమ్యనవిదుః సత ఆగచ్ఛామహ ఇతి త ఇహ వ్యాఘ్రైవాసింహోవా వృక్షోవా వరా హోవా కీటోవా ఏపంగోవా దంశోవా మశకోవా యద్యద్భవంతి తదా భవన్తి ॥ (ఛాం 6-10-1,2)

సముద్రము నుండి ఆవిరిగా ఆయిపైకి లేతిన నీరు వర్షంగా వడి గంగాది నగుల రూపముతో ప్రవహించి సముద్రంలో పడుతుంది. ఇట్లు మళ్ళీ మళ్ళీ సముద్రము నుండే పుట్టి సముద్రమునకు చేరుతున్ననూ ఈ గంగ, యమున మొదలగునని సముద్రము నుండి వచ్చినవి సముర్ధమునకే చేరుచున్నవి.

అను జ్ఞానము మనకు ఉండనే ఉండదు కదా ? ఇలాగే మనము ఈ సద్బ్రహ్మమను స్మస్త్రర్ధమునుండేవచ్చి వివిధమైన జీవులుగా వ్యవహరించి మళ్ళీ మళ్ళీ అదే సముద్రములో పడుచున్నాము. అయిననూ మనము ఎప్పుడునూ ఆ సముద్రములో పడుచున్నాము. అయిననూ మనము ఎప్పుడునూ ఆ సముద్రమునకు చేరిన వారమే, వేరు కాదు - అని ఎరుగక ఉంటున్నాము. జీవులందురూ ఇట్లే సన్మాత్రమైన నిర్విశేష బ్రహ్మయే అయి వున్నప్పటికీ దీనిని తెలియకయే మళ్ళీ మళ్ళీ ఆ సద్బ్రహ్మ నుండే వచ్చుస్త్రచన్మాను దానిని ఎరుగక ఉంటున్నాము. అజ్ఞానము యొక్క వాసనతో తాము ఏఏ విదమైన ప్రాణులని తెలుసుకొని ఉన్నారో ఆయా విధముల ప్రాణులుగానే మళ్ళీ మళ్ళీ మేల్కొందురు.

సుషుప్తియందు అన్ని ప్రాణులూ, మనుష్యులూ మాత్రమే కాదు. పులి సింహము, నక్క పంది, పురుగు, దోమలూ - అన్నియూ సద్బ్రహ్మయందే సంపత్తిని పొంది ఆ బ్రహ్మయొక్క స్వరూపమందే ఉంటాయి. మళ్ళీ మేల్కొనగానే పులి పులియే. ఎలుగుబంటి ఎలుగుబంటిగానే సింహము సింహముగానే అయి మేల్కొనినట్లు మనుష్యుడు మనుష్యుడుగానే మేలొ్రను. ఇలాగున్నది అజ్ఞానము యొక్క ప్రభావము బ్రహ్మయ్‌దే చేరిపో.ట బ్రహ్మయందే ఉండి. బ్రహ్మయందే అన్ని వ్యవహారములూ చేయుచున్ననూ మనము ఇటువంటి జీవులను అజ్ఞానముయొక్క వాసనయే అంటుకొని యున్నది.

అత్తంత సూక్షమైన ఆత్మ వస్తువునుండి ఇంత చిత్ర విచిత్రమైన అంతటా వ్యాపించి కొనియూన్న జగత్తు ఎట్లు వచ్చియున్నది ! అని శంకించ కారణములేదు మఱ్రి చెట్టు గింజ ఎంత చిన్నదిగా ఉండును ! అయిననూ దానినుండి అంత శాఖోపశాఖల తోనూ ! ఊడలతోనూ కూడియున్న అద్భుతాకారముగల చెట్టు పుట్టుట లేద& ? చిన్నదాని నుండి పెద్దది పుట్టుబ చూచితిమి. తూతిన దానిని తర్కమునకు పొందదు అని తిరస్కారము చేయవచ్చా ! సుషుప్తియందు సద్బ్రహ్మమును తేరకి కొనుట మళ్ళీ మళ్ళీ అనుభవమును తిరస్కరించి కుయిక్తిని చేయరాదు. అనుభవమునకు తగునటుమంటి యుక్తినే పొందించుకొనుట తెలివిగలపని దానితోనే మనకు శ్రేయస్సు కలుగును.

ఇది ఇటుంచండి ఇంత అతీంద్రియమైన ఈ సదాత్మ వస్తువును మనము ఎట్లు తెలుసుకొందుము. అను శంక ఒకటి మనలను పీడించవచ్చు. దానికి ఒక దృష్టాంతమును ఉద్ధాలకుడు ఇచ్చు చున్నాడు. నీటియందు ఒక ఉప్పు కణమును వేసినచో అది కరిగి నీటియందే కలిసిపోవును. ్పుడు నీటిలోపల అంతయు చేతితో కలియబెట్టిననూ ఉప్పుకణము రూపముతో అది చేతికి దొరకక పోవచ్చును. అయిననూ అక్కడే ఉన్నది అనుదానిని నాలుకతో తెలుసుకొనుటకు వీలు లేదా?

అప్పుడు నీరంతా యా ఈ ఉప్పు వ్యాపించుకొని ఉన్నది అని తెలియునుగదా ? ఇలాగే ఆత్మ తత్తము ్న ఇంద్రియములకు గోతరము కాకపోవచ్చు. అయితే

అనుబవము యొక్క కన్నుతోచుచినచో ఈ ఆత్మతత్త్వమే అంతటా వ్యాపించుకొని యున్నదనియూ ఇదే అన్నిటికీ ఆత్మై ఉన్నదనియూ స్పష్టమగును.

అప్పుడు ఇంకొక శంక - ఏ ఇంద్రియమునకు గోచరముగాని వస్తువును మనము తెలుసుకొనుటకు ఇట్లు అనుభవమే ఉపాయమైతే దీనిని మరియొకరితో ఎరుగవలయునా ఏమి ! మనకు మనమే తెలుసుకొనుటకు వీలులేదా! దీనికి పరిహారముగా ఉద్దాలకుడు ఒక కథను చెప్పినాడు. పూర్వము గాంధారదేశపు ఒక మనుష్యుని దొంగలు కళ్ళకు కట్టి దూరముగా మోసుకొని వెళ్ళి గొప్ప ఆడవియందు వదనివేసినారు. అతనికి దిక్కుతోచక ఆకలిదప్పులతో బాధపడుచూ పులి, ఎలుగుబంటి, దొంగలు మొదలగువాటి భయముతోకూడియున్న ఆ అరణ్యమందు దుఃఖార్తుడై ఎవరైనా నన్ను విడిపించండి ? దొంగలు కళ్ళుకట్టిపోయినారు ! అని అరుచుటవల్ల ఎవరో ఒకదారిని పోవువాడు కరుణతో అతని కళ్ళను విప్పి గాంధారదేశము యొక్క దారి గుర్తులను చెప్పి పంపించెను. అప్పుడు అతను తన బుద్ధితో మార్గమును ఊహించుకొని మళ్ళీ ఇంటికివచ్చి చేరెనట. ఇట్లే ఈ జీవుడు ఇంద్రియములను గొంగలకు చిక్కి ఈ సంసారముయొక్క అడివినందు కష్టపడుచున్నాడు. మహాకారుణికుడైన ఆచార్యుడు ఇతని అవిద్యఅను కట్టును విప్పిన తర్వాత జ్ఞాన చక్షువుతో తన లోపలకు తాను చూసికొని అనుభవముతోనే ఆత్మను తెలుసుకొనును. ఇంద్రియములతో బయటకు చూచుచున్న మనకు నీ లోపలకే చూచుకొని తత్త్వమును తెలుసుకొనండి అని ఉపదేశించు ఒక అనుభవియైన ఆచార్యుడు కావలసియున్నది - అనునది స్వాభావికమై యున్నది. తెలిసినవారి ఉపదేశము లేకపోతే మనము ఆ గాంధార దేశముయొక్క షావుకారువలె కళ్లు కట్టించకొని ఊరక దుఃఖిస్తూ సంసారముయొక్క కారడవినందే కాకుతో కష్టములు పడుతూ ఉండవలసినదే కదా ?

ఈ సద్బ్రహాత్మయొక్క జ్ఞానము కలిగినవారికి సంసారముయొక్క దుఃఖముండదు. మిగతావారికి మాత్రము ఈ దుఃఖమప తప్పదు అనుదానిని మనసునందు గుర్తుంచుకొనుటకు శ్వేత కేతువుయొక్క తండ్రి దృష్టాంతమును

ఇచ్చినాడు. నేను ఆదృష్టాంతమును మందరికీ ప్రసిద్ధమయిన రూపమునకు తెచ్చిచూపెదను. ఒకదొంగ పోలిస్‌వారి చేతికి దొరికిపోయి విచారణకాలమందు అబద్ధము చెప్పినాడనియూ అడను నిజుగా దొంగయే అనియూ గుర్తించినచో అతని తప్పుకు తగిన శిక్షను పొంది దుఃఖించవలసినదిగా నున్నది. అతను అపరీధికాడని నిశ్చయమైతే అప్పుడు అతనిని వదని వేయుదురు కదా ! ఇలాగే ఈ జగత్తంతయూ పరమాత్మనుండేలచ్చుచున్నది.

నాకు ఆ పరమాత్మే నిజమైన ఆత్మ ! ఆ పరమాత్మే పరమార్థ సత్య స్వరూపుడు, మిగిలినదంతయూ అతనితో పోల్చినచో మిథ్యయే - అని సత్యమును ఎరిగిన వాడు శ్రేయస్సును పొందును. అతనికి ఈ మిథ్యయైన సంసారముతో కలుగు దుఃఖమప అంటదు. అయితే మనము సత్యమును కనుగొనుటకు ప్రయత్నించక మిథ్యమైన ఈ మన కర్తృత్వ భోక్తృత్వ రూపమునే సత్యమన నమ్మినతో మన నిజమైన ఆత్తతత్వ రూపమునే దొంగిలించిన దొంగల మగుదుము. ఆ అరకార్యమునతు దాను మనము సంసారము యొక్క దుఃఖమును మళ్ళీ మళ్ళీ అనుభవించనగును. కొందరు తత్త్వమును తెలియక పోయిననూ నేను బ్రహ్మమే నాకు తత్త్వము తెలిసియే యున్నది. మరియొకరద్వారా నేను దీనిని కూడా తెలుసు కొనక్కరలేదు. అని అందురు. వారు అబద్ధమును చెప్పిన కొంగలవలె, తమ ఆపరాధమునకు తగిన సంసార దుఃఖమును చెప్పిన దొంగలవలె, తమ అపరాధమునకు తగిన సంసార దుఃఖమును కఠిన శిక్షను అనుభవించే తీరవలయును. అలాకాక ఎవరు శ్వేతకేతువు వలె సద్గురువుల ఉపదేశమును పొంది సన్మాత్ర బ్రహ్మమే అంతయూ అయియున్నది. అదే నిజముగా అందరికీ ఆత్మ, అదేనేను అను అనుభవమును పొందుదులో అటువంటి వారు వట్టి సుషుప్తి యందు మాత్రమే కాదు. ఎప్పుడూ నత్సంపత్తినే పొంది నిత్యముక్కులుగా సుఖించుదురు.

# 19. బ్రహ్మాత్మవిద్య

మనము ఈ రోజువరకూ అనుభవమునే అశ్రయించి ఆత్మ స్వరూపమును గుర్తించు విధానములనే తెలుసుకొనుచూ వచ్చుచున్నాము. నిన్నటిరోజు శ్రుతి ప్రసిద్ధమయిన తత్త్వమసి అను వాక్యము యొక్క అభిప్రాయము అనుపభవమునకు తెచ్చుకొను ప్రకారమును గురించి విచారము చేయుతున్నాము. ఇప్పటి కొందరు వేదాంతులు 'తత్త్వమసి' అనునది ఉపదేశ వాక్యమనియూ, అహంబ్రహ్మాస్మి అనునది అనుభవవాక్యమనియూ వాక్యములను విడదీయుతున్నారు. గురువైనవాడు నీవు బ్రహ్మమే అని ఉదహరించును. శిష్యుడైన వాడు నేను బ్రహ్మమే అని తెలుసుకొనును - అనునది నిజము. అయితే ఈ రెండు వాక్యములతూ అనుభవమే ఆధారము అనుభవమందే వీటి జ్ఞానము పర్వవసానము చెందవలయుమ. ఈ దృష్టితోనైతే ఈ రెండింటికీ ఏ వైలక్ష్యము ఉండనే ఉండదు. (లేనే లేదు)

తీ రోజు అహంబ్రహ్మాస్మి అనువాక్యమును గురించి కొన్ని విచారములను మీముందు పెట్టెదను. ఈ విచారము కూడా అవశ్యముగా అనుభవమునే ప్రధానముగా పెట్టుతొనినది. బ్రహ్మాత్మ స్వరూపమును ఎరుగక పోవుటచేత మనము పరిచ్చిన్న రూపమై యున్నాము అను అనాది బ్రాంతి మనయందు నెలకొనినది. మనము బ్రహ్మాత్మ స్వరూపులమే అని తెలిసికొనిన మార్తము తేచ ఇది తోలగును. మనము సర్వాత్మరగుదుము. ఈ విద్యా విద్యల స్వరూప కార్యములను బృహదారణ్యకము ఒక కాండమందు ఇట్లు వర్ణించినది.

బ్రహ్మ వా ఇదమగ్ర అసీత్త దాత్మానమేవావేత్ అహంబ్రహ్మాస్మీతి తస్మాత్తత్ సర్వమజలత్ తద్యో యో దేవానాం ప్రయ్యబుధ్యత స ఏవ తదభవత్తథర్షీణాం తథాత మనుష్యాణాం తద్వైతత్పశ్యన్నృషిర్వామదేవః ప్రతిపేదే హం మనురభవం సూర్యశ్చేతి । తదిదమప్యేతర్హి య ఏవ వేదాహం బ్రహ్మాస్మీతి స ఇదం సర్వం భవతి తస్యహన దేవాశ్చనాభూత్యా ఈశతే । ఆత్మాహ్యేషాంస భవతి। అథ యో న్యాం దేవతాముపస్తే న్యోసావన్యో హంమస్మీతి నసవేద యథా పశురేవం స

దేవానామ్ ॥ (బృ1.4.10)

ఇక్కడ సరావత్మభావము బ్రహ్మమునకు ఎట్లు వచ్చియుండును ? బ్రహ్మము ఏమియూ ఎరుగకనే సర్వమూ అయినదనితో మనకుకూడా అట్లు ఎందుకు కారాదు ? లేక బ్రహ్మముకూడా మరియొక తత్త్వమును ఎరుగుటచేతనే సర్వభావమును పొందెను అనగా ఆ ఇంకొక తత్త్వమునకు ఎట్లు సర్వాత్మభావము వచ్చియుండినది? అనుప్రశ్న మొలకోత్తును. అప్పుడు ఆతత్త్వము ఏ మరియొకదానిని ఎరుగుటచేత, ఆ మరియొకటి కూడా ఇంకా వేరు దేనిని తెలిసికొనుటచెత సర్వాత్మత్వమును పొందినది ? అని ఆక్షేపముల వరుసకు అంతులేకుండా పోవును. ఈ చిక్కును ఎట్లు విప్పుకొనవలయును ? అను శంకకు ఇక్కడ సమాధానమును చెప్పినది.

బ్రహ్మము మరియొకదానిని తెలుసుకొని సర్వమూ అయినది అను వాక్యములకు అక్షరార్ధమునే పెట్టుకొనుటచేత ఈ చిక్కువచ్చినది. ఉపాసకుడు ఉపాస్యదేవతను 'నేను' అను భవనతో ధ్యానము చేసినచో ఆ దేవత స్వభావమే వచ్చునని వేదమందు చెప్పినది. ఇలాగే మనము సర్వరూపమైన బ్రహ్మమును 'నేనే' అని ధ్యానించి సాక్షాత్కారమును పొందవలయునను శ్రుతికి తప్పుగా అర్థమును కల్పించుకొనుటచేత ఈ చిక్కు కలుగును. వస్తుస్థితి ఇట్లులేదు. ఉన్నదంతయూ బ్రహ్మమొక్కటే. అదే మనందరి ఆత్మైయున్నది. బ్రహ్మమనునది మనకంటె వేరులేదు. అది ఉపాస్య సర్వాత్మ భావమును, జ్ఞానముయొక్క బలముతో వెంటనే పొందెను. ఈ జ్ఞాన బలముతోనే ఆయన ఋగ్వేదమందున్న "అహం మనురభవంసూర్యశ్చ" అను మొదలైన మంత్రములను కనిపెట్టెను.

ఇక్కడ అజ్ఞానముపోవుట, జ్ఞాముువచ్చుట, అరబహ్మమును వదులుట, బ్రహ్మత్వమును పుట్టించుకొనుట ! అర్హత్వము తోలగుట, సర్వాత్మకము పొందుట-అను రెండు ఘటనలు కలుగవు- అందరూ ఇప్పుడే ఇక్కడే బ్రహ్మస్వరూపులుగా అయియున్నారు. సర్వులూ అయిఉన్నారు, ఈ జ్ఞానము లభించుటకు వామదేవ ఋషివలె మనము కూడా మహావీర్యులైన ఋషులే

కావలయునని నియమేమియూలేదు. సిరియైన ప్రత్యగ్దృష్టి ఉంటే ఇప్పుడుకూడా ఎవరైననూ " నేను బ్రహ్మనే " అను జ్ఞానమును సంపాదించుకొనవచ్చుయు సర్వాత్మభావనకూడా పొందవచ్చు. "నైష్కర్మ్య సిద్ధియందు శ్రీ సురేశ్వరాచార్యులవారు వ్రాసిన దేమనగా " దేశకాలక్యసంబన్ధాదేశాదేర్మోహకార్యత ః । నానుత్పున్న మదర్థం వా జ్ఞానమజ్ఞానమ స్త్వతః ॥ బ్రహ్మమునకు దేశము, కాలము - మొదలగు వాటి సంబంధము లేదు. ఎందుకనగా దేశాదులుకూడా అవిద్యాకార్యమై యున్నవి. దేశము, కాలము, నిమిత్తము - ఇవన్నియూ నిజముగా అనుభవస్వరూపమైన బ్రహ్మమే. అందుచేత 'అజ్ఞానము, ఇప్పుడు, ఇటువంటి స్థలమందు, ఇటువంటి నిమిత్తముతో పోవును, జ్ఞానము ఇటువంటి కాలమందు ఇటువంటి దేశమందు ఇటువంటి నిమిత్తముతో వచ్చును - అనునది కూడా అజ్ఞానమే. పోకుండాఉన్న అజ్ఞానములేదు. రాకుండాఉండు జ్ఞానమూలేదు. జ్ఞానము అజ్ఞానము, అన్నియూ అనుభవరూపమైన బ్రహ్మత్మయ్ అయియున్నది.

అందుచేత 'బ్రహ్మము తనను తానే తెలుసుకొనినది, (ఎరిగియుండినది) అని వెనుకకాలమందు దానికి అజ్ఞానము పోయినదనియూ, జ్ఞానము కలిగినదనియూ ఆ తర్వాత దానికి సర్వాత్మభావము వచ్చినదనియు తెలియకూడదు. బ్రహ్మము బ్రహ్మమును విషయము చేసికొని ఎరుగదు: ఆ తర్వాత అది సర్వము కాదు జ్ఞాతృ జ్ఞానజ్ఞేయము అను విభాగము, పోవుట, వచ్చుట అను విభాగముకూడా బ్రహ్మయందు ఉండదు (లేదు). మనము బ్రహ్మమే అయియుండుటచేత మన స్వరూపమందు ఇప్పుడు కూడా అవిద్యలేదు. విద్యయు రావలసిన పనిలేదు. దీనిని అనుభవమునందు కనుగొనినచో వ్యక్తిత్వము మనయందు ఎప్పుడూ లేదనునది స్ఫురించును.

దేవతలయందు, ఋషులయందు లేక మనుష్యులయందు కొందరు " నేను బ్రహ్మనై యున్నాను " అని తెలుసుకొనిరి - అను దానిని ఇట్లే తెలియవలయును. 'దేవతలు అనేకులు " ఋషులు అనేకులు 'మనుష్యులు అనేక్లస్త్ర " - ఇట్లు అనేకత్వము బ్రహ్మయందు లేనేలేవు. మంత్రద్రష్టలైన ఋషులు

అంతర్ధానాది శక్తులుగల దేవతలు, ధలకలకాది సంపత్తులుగల మహాత్ములైన మనుష్యులు - వీరిలాగే ఆజ్ఞాజ్ఞలు ! అల్పశక్తి గలవారు. దీనాంధబదిరులైన అల్పజనులు - అందరూ ఇప్పుడు నిత్యమూ, అవిషయమైన, అద్వితీయమైన దేశకాలాద్యపరిచ్ఛిన్నమైన బ్రహ్మమే అయియున్నారు. బ్రహ్మము " తననే తెలుసుకొనినది అలాగే మీలోపలి స్వరూపమైన ఆత్మనే తెలుసుకొనండి. అందుచేత బ్రహ్మగా అగుదురు. అనగా బ్రహ్మయందు అంతర్బహిర్భావమును కల్పించుకొనరాదు అనే అర్థము. అనాత్మయైన దేహాదుల పరిచ్ఛేదము మనకు ఎవరికినీ, ఎప్పుడును లేదు : ఇకముందు మనము ఈ పరిచ్ఛిన్న బావమును పెరికివేసి బ్రహ్మముగా కావలసినదేమియూ లేదు. ఇప్పుడే అంతయూ బ్రహ్మమొక్కటే అయిఉన్నది. దీనిని ఎరిగినవారికి ఆ బ్రహ్మత్వమనురోగము బ్రహ్మత్మవిద్య అని ఔషదితో నిజముగా పోవుటకాదు మరేమనగా "నేను ప్రహ్మనై యున్నాను" (నేను ఆబ్రహ్మనే అయిఉన్నాను)" అని అందురు. వారికి ఇప్పుడే, ఇక్కడే నిత్య సిద్ధమైన సర్వాత్మ భావముయొక్క జ్ఞానము కలుగును.

# 20. సుషుప్తాత్మత్వము

వేదాంతమందు చెప్పిన బ్రబామ్మనుభవము మనకు అలవడుటకు సుషుప్తి యందు సర్వుల అనుభవమందునూ ఉన్న ఆత్మస్వభావమును గురించి మరల మరల చింతించు చుండవలయును. ఉత్తవాదికారులకు ఈ చింతనదావరానే అనుభవము ఉదయించవలసినదిగా యున్నది. అందుచేత ఈ రోజు ఈ అవస్థయొక్క ఆత్మస్వరూపమునే ముఖాయముగా విచారమునకు తీసుకొందాము.

విజ్ఞానాత్మా సహ దేవైశ్చ సర్వై ః ప్రాణాభూతాని సంప్రతిష్ఠన్తి యత్ర ।

తదక్షరం వేదయతే యస్తు సోమ్యస సర్వజ్ఞః సర్వమేవావివేశ ॥ ప్ర.4.॥

ఇది ప్రశ్నోపనిషత్తునందు గార్గ్యునికి పిప్పలాదఋషి చెప్పిన గాని సంగ్రహ వాక్యము, సుషుప్తియందు విజ్ఞానాత్మ ఉండదు. ఇంద్రియములూ, వాటి అధిష్ఠాన

దేవతలూ ఉండరు. పృధివ్యాది భూతములూ ఉండవు, ఇంద్రియములూ, వాటి అధిష్ఠాన దేవతలూ ఉండరు. పృధివ్యాది భూతములూ ఉండవు. అప్పుడు ఇదంతయూ ఒకటిగా అఖండమైన అద్వితీయమైన నిర్విశేషమైన అక్షరమను పేరుగల పరమార్థతత్త్వ మొకటే మిగిలియున్నది. దానియందే ఈ ప్రపంచమంతయూ కలిసిపోయినది. భౌతికమైన శరీరము లేకుండా, ఇంద్రియములు లేకుండా, బయటి విషయములు లేకుండా మనకు ' దీనిని ఎరుగుచున్నాను ' అను విశేషజ్ఞానము కలుగజాలదు. సుషుప్తి అనుభవము మనందరికి కూడా కలుగుచుండుటచేత అప్పటి మన స్వరూపము ఏ విశేషమూలేని అక్షరబ్రహ్మాయేం అనునది నిజమని ఏర్పడును, ఇంద్రియమునను ప్రయత్నపూర్వకముగా లయించుకొని ఆత్మయందు స్థిరముగా నిలిచినచో. ఆ అవస్థను 'ససూధి' అని పిలుచుదురు. ఇవి స్వాభావికముగానే శ్రమాది నిమిత్తముతో లయమై అక్షరరూపముతో మిగులుటను ' సుషుప్తి ' (గాఢనిద్ర) అందుము సరిగా చూచినచో ఈ రెండునూ ఒక్కొక్క అవస్థకాదు. అప్పుడు మనము మన నిజమైన స్వరూపమందే ఉండిపోదుము. అంతే,

ఈ అక్షరరూపమును ఎవడు అనుభవమునకు తెచ్చుకొనునో ఆయన సర్వజ్ఞిడు : ఆయనే సర్వమూ అయియున్నాడు. జ్ఞానమాత్రస్వరూపమూ అయియున్నాడు. సర్వమునే - అనగా అన్నియూ అయియున్న అక్షర బ్రహ్మమునే ప్రవేశించి దాని యందే కలిసిపోవును. ' సుషుప్తుడుగా నున్నాడు' నిద్రించుచున్నాడు అనునది ఒక క్రియకాదు : ఎందుకనగా అతనికి అప్పుడు కర్తృత్వములేదు. కర్తృత్వములేని ఏ వ్యాపారములేని స్థితియది. దీనిని మనస్సునందు నెనరువేసుకొనినచో మనకు సమాధియే వచ్చును. సమాఖియందు మనకు ఏ శరీరాదులును లేవు (ఉండవు. అవి ఉన్నవి యనుటకు విజ్ఞానాత్మయే కదా ప్రమాణము ? ఆ విజ్ఞానాత్మకూడా ఇక్కడ పరమాత్మయందు కరిగిపోవును. ఆ ఆత్మ స్వభాపము ' నవర్ధతే కర్మణానోకనీయాన్ " అనినట్లు ఏమైననూ చేసినదాని ఫలముగా పొంగుటయూలేదు కుంగుటయూ లేరు.

ఇన్ద్రియాణాం పృథగ్భావముదయా స్తమయౌ చ యత్ ।
పృథగుత్పాద్యమానానాం మత్వా ధీరో న శోచతీ ॥ (క. 6.6)

ఇది కఠోపనిషత్తునందున్న వాక్యము. ఇంద్రియములు ఆయా భూతముల నుండి పుట్టి జాగ్రత్స్వప్నములయందు తమతమ విషయములను గ్రహించు చున్నవి సుషుప్తియందు మళ్ళీ భూతములతోనే సుషుప్తాత్మయందు కరిగిపోవును. విజ్ఞానాత్మ కై ఇంద్రియములు పుట్టి పనిచేయుచున్నవి. విజ్ఞానాత్మయేలేని అవస్థయందు అవి ఉండుటకు అవకాశములేదు. దీనిని మరలమరల చింతించవలయును. ధీనితో మన నిజమైన స్వరూమునకు విజ్ఞానాత్త్వము చేరదు. అనుజ్ఞానము కలుగును ఇదే ఆత్మానుభవచేరదు, మరనునది.

సుషుప్తస్థాన ఏకీభూతఃప్రజ్ఞాన ధన ఏవానన్దమయో హ్యా
నందభుక్ చేతోముఖఃప్రాజ్ఞస్తృతీయః పాదః ॥ (మా 5)

మాండూక్యోపనిషత్తునందున్న సుషుప్తి వర్ణన ఇది. సుషుప్తి అను అవస్థయందు విషయ, విషయి విభాహమంతయూపోయి అంతయూ (అన్నియూ) ప్రజ్ఞాన ఘనము (ఎరుక ముద్ద) వలె ఒకటిగా అయిపోవును, అక్కడ ఒక్కొక్క విషయమునకు ఒక్కొక్కటివలె వేరువేరు విశేషజ్ఞానములునూ ఉండవు. అదికూడా జ్ఞానమాత్రముగా ఆత్మస్వరూపమందే చేరి ఒకటిగా అయిపోవును. అక్కడ ఇప్పుడున్నట్లు విషయ విషయి భావముతో అనుభవించు సుఖముండదు. ఒకే ఆనందముండి యుండును, అప్పుడు మన ఉనికి, జ్ఞానము (ఎరుక), ఆనందము ఇవన్నియూ మన స్వరూపమే అయియున్నవి. ఇక్కడ మన ఆత్మే ఉనికి: ఎరుక, సుఖము లౌకికమైన సత్తా జ్ఞానము సుఖములకంటే వేరుగానున్న నిర్వికల్పమైన సచ్చిదానందస్వరూపమే మనదై యున్నది శబ్దములు లౌకికమే అయి ఉన్నపటికీ వాటితో తెలిసికొనవలసిన ఆత్మ స్వరూపము లౌకిక పదార్థములుకంటే విలక్షణమైయున్నది.

4. సహోవాచా జాతశత్రుర్యత్రైష ఏతస్సుప్తోభూధ్యా ఏషవిజ్ఞానమయః పురుషస్తదేషాం ప్రాణనాం విజ్ఞాననేన విజ్ఞానమాదాయ యఏషోన్తర్

హృదయఆకాశస్తస్మిఞ్ఛేతే తాని యదా గృహాత్యథ హైతత్పురుషః స్వపీతి నామ॥ (బృ 2-1-17)

ఇది బృహదారణ్యా కోపనిషత్తు నందు సుషుప్తి విషయమును గురించిన వాక్యము అజాత శత్రువను హాజు, గార్గ్యుడుయను బ్రాహ్మణుడు - వీరిద్దరి సంవాద రూపముగా తత్త్వ నిర్ధారణమును చ్ాయు సందర్భమందు ఈ వాక్యము వచ్చినది. గార్గ్యుడు ఆదిత్య మండలాదులయందున్న పురుషుడ్ బ్రహ్మయను భావనతో ఉ పాస్యబ్రహ్మయందు నిష్టుడుగా నుండెను, ఆ అపరబ్రహ్మస్వరూపము కంటెను వ్యతిరిక్తమైన శుద్ధ బ్రహ్మమును తెలియజేయుటకు అజాతశత్రువు చెప్పిన సుషుప్తి వాక్యమిది.

సుషుప్తావస్థకు పోవుటకు ముందు ఈ విజ్ఞానమయ పురుషుడు వాగాదింద్రియముల యందున్న విశేష విజ్ఞానము యొక్క శక్తిని తీసుకొనును. సుషుప్తి యందు ఆయన హృదయాకాశమను పరబ్రహ్మ రూపమందే ఉండి యుండును, ఇట్లు ఇంద్రియజ్ఞానము లన్నిటిని తీసుకొని ఆకాశ శబ్ద వాచ్యమైన బ్రహ్మయ్ందు చేరియుండునుగదా। అప్పుడు ఇతనికి స్వపితి (సుషుప్తుడయి యున్నాడు) అను పేరు వచ్చును. ఈ స్వపితి శబ్దము యొక్క సావరస్యమును అప్పుడే ఒకసారి వివరించినాను. విజ్ఞానమయాత్మ అప్పుడు తన పరమార్థ స్వరూపమయిన ఆకాశము వలె సర్వగతమునూ అసంగమునూ అయియున్న పరబ్రహ్మ స్వరూపమందే చేరిపోవును. అప్పుడు ఇతనికి ఇంద్రియ వ్యాపార రూపమైన ఏసంసారము ఉండదు. ఇట్లు క్రియాకారక ఫలహరూపమైన సంసార స్వభావమే లేని తన స్వరూప మందుండుట చేతనే ఇతనికి స్వపితి అను పేరువచ్చినది అని అభిప్రాయము.అజాత శత్రువు 'అప్పుడు సుషుప్తావస్థ యందు ఈయన ఎక్కడున్నాడు ? ఇప్పుడు ఎక్కడనుండి వచ్చెను? అని గార్గ్యుని అడిగినాడు. ఈయనికి అది తెలియక పోవుటచే ఈ సుషుప్తి యొక్క అనుభవమును తెలియజేసి అప్పుడు తన స్వభాపమే అయిన పరమాత్మ యందే యుండెను. ఇప్పుడు అదే పరమాత్మ నుండే ఇట్లు వచ్చి విజ్ఞానాత్మగా తోచుచున్నాడు. అని చెప్పినాడు. బ్రహ్మ

సూత్రమందునూ బాదరాయణులు సుషుప్తియొక్క విచారమును చేయునప్పుడు "తదభావో నాడీషు తచ్ఛ్రుతేరాత్మనిచ" (బ. సూ 3-2-7) జాగ్రత్తు నుండి కలకు వచ్చినవాడు ఆ కలకూడా లేనిదగునుసుషుప్తావస్థ యందు నాడులద్వారా పరమాత్మ యందే కలిసి పోవుచున్నాడు - అని చెప్పినారు. అక్కడ సుషుప్తిని తదభావ (స్వప్నము యొక్క ఆభావము) అని వర్ణించు చుండెనెగాని మరి ఏ ఒక్క విషయము యొక్క సంబంధము జీవునకున్నది అని విధిముఖముగా వర్ణించి చెప్పలేదను దానిని లక్షించవలయును. ఏ ఉపాధి యొక్క హంగూ లేక తన స్వరూపమైన పరమాత్మయందు ఒకటగుటే సుషుప్తి అనునది బాదరాయణా చార్యున మతమని ఇందు వలన ఏర్పడును. గీతా భాష్యమందును భాష్యకారులు నచ దేహాదాయత్మ ప్రత్యయభ్రాషున్తిసన్తానవిచ్ఛేదే సుషుప్తి సమధ్యాదిషు కర్తృత్వ భోక్తృత్వాద్య నర్థ ఉపరభ్యతే తస్మాత్ భ్రాన్తి ప్రత్యయ నిమిత్తమేవాయం సంసారభ్రమో నతు పరమార్థ ః ఇతి సమ్యగ్దర్శనా కత్యన్త మేవోపరమః ఇతి సిద్ధమ్ ( గీ భా. 18-66) అని వ్రాసినారు. సుషుప్తి సమాధి మొదలగు అవస్థలయందు దేహము' ఇంద్రియములు మొదలగునవియో నేను అను భ్రాంతిసంతానము లేకుండా పోవును. అందుచేత దేహాదులే నేనను భ్రాంతితోనే (వల్లనే) మనకు సంసారిత్వ భ్రాంతి వచ్చియున్నది. నిజముగా లేవు అనినట్లయినది - అనునది ఆవాక్యము యొక్క అభిప్రాయము. ఇట్లు శ్రుతి సూత్రము, గీతా భాష్యము - వీటన్నిటి యందు సుషుప్తి అను అవస్థయందు మన పరమార్థ స్వరూపమైన బ్రహ్మయందే మనమున్నాము. దానిని ఎరుగ కుండుటచేతనే మనకు సంసారిత్వభ్రాంతి కలిగినది - అని స్పష్టముహా చెప్పినవి. ఇట్లున్నానూ కొందరు అక్కడకూడా మనకు మూలావిద్య అను ఒక సంసార దోషమున్నదని నిప్రమాణకముగా చెప్పుచున్నారు వారి అబిప్రాయము ఎలాగైననూ కాని, ఆచార్యుల ఉపదేశమునకు అనుగుణముగా సుషుప్తి యొక్క అనుభవమును మనము పరిశీలించినచో అధికారులైన జిజ్ఞాసువులకు మనము బ్రహ్మ స్వరూపులమే అను బోధ అనుభవాను సారమయినదే అనుటలో ఏ సంశయమూ మిగులదు.

# 21. అధ్యాత్మవిద్యకు సాధనములు

ముముక్షువులయిన వారికే శ్రుతియందు చెప్పిన పరమాత్మ జ్ఞానము కలుగును తగినంత సాధన సామాగ్రి ఒనగూర్చు కొనని వానికి సాధ్యము దక్కజాలదు గదా। అందుచేత ఈ రోజు పరమార్థ జిజ్ఞాసువైన వాడు ఏఏ సాధనములను గాఅలవరుతు కొనవయునను దానిని తెలియజేయుదును.

1. నాయమాత్మా ప్రవచనేన లభ్యోన మేధయా నబహూనా శ్రుతేన యమేవైష వృణుతే తేన లభ్యస్తస్యైష ఆత్మా వివృణుతే తనూంస్వామ్ ॥ ముం 3.2.3

ఈ అత్మలాభమే అన్ని లాభముల కంటెనూ గొప్పలాభము. అయిననూ దానిని పొందుటకు చాలా (ఎక్కువ) సాధనము కావలసిన వచ్చును. అను కల్పన చేయనవసరము లేదు. ఆత్మ లాభమునకుగాను గ్రంథములను అంత ఎక్కువ చదువవలసిన పనేమియూ లేదు. చదివిన దానిని జ్ఞప్తియందుపెట్టుకొను మేధా శక్తియూ దీనికి సాధనకాదు. అనేకులవద్ద ఎక్కువగా శ్రవణము చేయుటయూ అంత ముఖ్యముగాదు. ఎందుకనగా గ్రంథములను చదివి వాటి విషయమును జ్ఞప్తియందుంచుకొని విచార పూర్వకముగా ఏదైననూ చేసి పొందవలసిన వాడు కాడు ఈ పరమాత్మ ఎందుకనగా ఈయన మనస్వరూపమే అయి ఉండుటచేత నిత్యలబ్ధ స్వరూపమే అయియుండి ఈ విధముగా మనకు దొరకకున్నాడు. ఆత్మ లాభమునకు గాను చేయవలసిన ముఖ్య సాధనమనగా పరమాత్మ మనకు కావలయును అను తహతహను మొదట సంపాదించు కొనవలయును. అప్పుడు పరమాత్మ ఆత్మలాభమునకు కావలసినసాధనములన్నింటినీ అలవరచును. అమెరిగాయందుస్వామి వివేకానందులు విశ్వధర్మ సమ్మేళనము నందు ఉపన్యాసమును ప్రారంభించుటకు మొదటి భయపడినాకట. అయితే సభాధ్యక్షులు నీవు ఇప్పుడు మాట్లాడియే తీరవలయును అని అదేశించగా "మూకం కరోతి వాచాలం పంగు లఙ్ఘయతే గిరిమ్ । యత్కృపా తమహం వన్దే పరమానన్ద మాధవమ్

॥ (ఎవని కృప కలిగినచో మూగవాడు కూడా చక్కగా మాట్లాడు వాడుగా నగునో, కుంటివాడు కొండను ఎక్కి దాటునో ఆ పరమానంద స్వరూపమైన మాధవునికి వందనము చేయుచున్నాను) అను శ్లోకము పఠించుకొని అర్థమును అను సంధానము చేసుకొని ఉపన్యాసము అరంభించిరట. ఆ భగవంతుని ప్రేరణతో Sistess and Brothers of America (అమెరికా సోదర సొదరీమణులారా అను సంబోధనా వాక్యము వారి నోటి నుండి బయటకు వచ్చినది. ఆ పాశ్చాత్త్యులను అందరినీ భావైక్యముతో తన వైపు త్రిప్పుకొను ఇటువంటి వాక్య సరళియే క్రొత్తవ యుండుట చేత సభికులందరూ వింటిరా ? అహా ఎంతటి ఉదాత్తభావన ఇది అను చూ పది నిమషముల వరకూ చప్పట్లు కొట్టుచునే యుండిగట। సావములకు మొదట దీని అర్థమేమిటనునదే తెలియలేదు. ఆ తమ ప్రేమ పూరితమైన వాక్సందర్భము సభికుల హృదయములన్నిటిని కలిపి తమ వైపు శ్రవణ కుతూహలముతో తిరుగునట్లు చిసియున్నది, ఆ పరమాత్మ ప్రాప్తికి మనము మనః పూర్వకముగా తహతహమడినచో ఆయన దయతో మనకు అన్ని సాదన సామాగ్రులూ ఒనగూడును.

**1. నావిరతో దుశ్చరితాన్నాశాంతో నా సమాహితః**

**నాశాస్త మానసో వారి ప్రజ్ఞానేనైన మాప్నుయాత్ ॥ (క2.24)**

చెడుపనులు విడువని వానికి ఇంద్రియచాపర్యము ఆపనివానికి మనస్స మాధానము యొక్క సుఖము కావలయునని తీవ్రముగా ఎదురు చూచువానికి జ్ఞానముతో కలుగవలసిన ఆత్మ లాభము కలుగును. ఆత్మ ప్రాప్తికి కావలసినది తర్కబుద్ధి కాదు, అంతఃకరణము యొక్క సంస్కారము. కర్మేంద్రియములనూ జ్ఞానేంద్రియములనూ విషయములవైపు పరిగెత్తి బయటకు పోవు మనస్సు గలవారికి ఎప్పుడునూ ఆత్మ మన లోపల ఉన్నాడు. చాంచల్యముతో బయటకు ప్రవహించ కుండునట్సు (పోకుండునట్లు) పట్టుకొను (నిగ్రహించు) కౌశలము మొదట కావలయును. ఎందుకనగా ఆ ఆత్మ మన లోపల ఉన్నాడు. చాంచల్యముతో బయటకు పోవు మనస్సు గలవారికి ఎప్పుడునూ ఆత్మ ప్రాప్తి

గాదు. ఏందుకలగా మనస్సు ఏకాగ్రతతో సమాధానమును పొందినప్పుడు దానితి ఆత్మయైన ఈ పరమాత్మ యొక్క జ్ఞానము మనలోపలనుండి పైకి వచ్చును. మన ఆత్మను మనలోపలనే కనుగొనవలసినదిగా ఉన్నది. అను దానిని మరువకూడదు.

**3. తం దుర్దర్శం గూఢమను ప్రవిష్టం గుహాహితం గహ్వరేష్టం పరాణమ్**
**అధ్యాత్మ యోగాధిగమేన దేవం మత్వాధీరో హర్షసోకౌజహాతి ॥ (క 2-12)**

పరమాత్మ అత్యంత సూక్ష్మమై యున్నాడు. ఆయనను ఇంద్రియములతో చూచుటకు ఎప్పుడునూ వీలుకాదు. బయటి విషయముల జ్ఞానములే ఆయనకు ముసుగు (ఆచ్ఛాదము) విషయముల వెంటబడుట తక్కువగాక ఆయన దర్శనము ఆయనను అక్కడే తెలుసుకొను వీలుండునే గాని బహిర్ముఖులకు ఆయన ఎప్పటికీ చిక్కినాడు. అందుచేతనే మనకు ఆయన దర్శనము కలుగకున్నది.

ఇటువంటి ఆత్మను జ్ఞానముతో కనుగొనుటఎట్లు ? అనగా ఆధ్యాత్మయోగముతో అనాత్మ యందున్న తాదాత్మయ బుద్ధిని విడుచుటకు చేయు ప్రయత్నమే అధ్యాత్మయోగము. అధ్యాత్మ విచారము యొక్క గ్రంథములన్నిటిని కొనగలిగి నంత ద్రవ్యము నీ వద్ద ఉండవచ్చును. అయితే వాటి నన్నిటిని కొనిన మాత్రముతో ఆత్మ జ్ఞానము దొరకజాలదు. దేహాద్యనాత్మలయందున్న అభిమానమును విడుచుటకు కావలసిన ప్రయత్నమును చేయవలయును. ఇట్లు ప్రత్యక్ దృష్చిని సంపాదించుకొను ప్రయత్నమును చేయువలయును ఇట్లు అధ్యాత్మ యోగముతో తనయందే తాము ఆత్మను కనుగొనునాడే హర్ష శోకములను దాటును.

**4. సత్యేన లభ్యస్తపసాహ్యేష ఆత్మా సమ్య జ్ఞానేన బ్రహ్మచర్యేణ నిత్యమ్ ।**
**అన్త శరీరే జ్యోతిర్మయో హి శుభ్రోయం పశ్యన్తియతయః క్షిణదోషా ః ॥**

**(ముం 3-1-5)**

ఈ శ్రుతి ఆత్మలాభమునకు కావలసిన సహకారి సాధనములచు చెప్పినగి. సత్యము తపస్సు - ఈ రెండు ఆత్మప్రాప్తికి అత్యంత అవశ్యమైయున్నది. ఈ రోజు ఉపన్యాసమునకు మరేమియూ విషయము కాదు - అను కారణముతో

నేను ఇట్లు శ్రుతి వచనములను ఉదహరించుటలేదు. ఈ సాధనములున్నచో వేదాంత జ్ఞానమునకు తగిన వాడగును అట్లు గానిచో కలుగదు. భగద్గీత యందు అమానిత్వాదులను చెప్పిన తర్వాత, భగవంతుడు ఏతచ్జ్ఞానమితి ప్రోక్తమజ్ఞానం యదతోన్యథా ఇదే జ్ఞానమని పించుకొనును. దీనికి విరుద్ధమై యున్నది. అజ్ఞానమనిపించుకొనును. అని చెప్పిన దానిని ఇక్కడ జ్ఞప్తికి తెచ్చుకొనవలయును. సత్యమనగా తాను చూచినదానిని వినిన దానిని ఉన్నది ఉన్నట్లు చెప్పుటే సత్యము సత్యమును చెప్పవలయును ప్రియమును చెప్పవలయును అప్రియమైన సత్యమును చెప్పరాదు. ప్రియమైననూ అనృతము చెప్పరాదు : అను స్మృతివాక్యమును మీరు వినియుండవచ్చును. నవ్వులాటకు కూడా అనృతమును చెప్పక సత్యమునే చెప్పవలయునదే సత్యస్వరూపమైన ఆత్మ ప్రాప్తియందు తనకున్న కాంక్షను చూపించును. తపస్సు అనగా ఇంద్రియములు మరియు మనస్సు - వీటి ఏకాగ్రత కృచ్ఛ చాంద్రాయణము మొదలగు దేహమును కృశింపజేయు రూపమైన తపస్సులు జ్ఞానమునకు సహకారులుకావు, అవి వాన ప్రస్థాదులకు  చెప్పిన సాధనములు ప్రకృత మందు ముముక్షువైన వాడు అంతర్ముఖుడై తత్త్వమును కనుగొనుటకు కావలసిన సాధనములనే ఇక్కడ విచారము చేయు చున్నాము. సమ్యక్ జ్ఞానమనగా ఆత్మయున్న రీతినే ఆయనను కనుగొనుటకు ప్రయత్నముచేయుట. వట్టి శాస్త్రమును సమ్యజ్ఞానము అనదు బ్రహ్మచర్యమనగా ఎప్పుడూ బ్రహ్మ యందే సంచరించు చుండుట. వేదమందే సత్యమందే నిష్టుడయిన వానికే ఈ ఆధ్యాత్మ జ్ఞానము దక్కును విషయముల స్మరణ విషయముల వ్యవహారము విషయముల భోగమునకు పరుగెత్తుట, విషయముల యందు మగ్నమగుట - ఇవన్నియూ బ్రహ్మతర్యమునకు అడ్డుగానున్నవి. అందుచేత ఆత్మతత్త్వము యొక్క అనుభవమునకు బ్రహ్మచర్యము అత్యంత ఆవశ్యమయి యున్నది. ఎందుకనగా నిజముగా కూడా ఆత్మానుభవమును పొందినవాడు ఆత్మశ్రవణము ఆత్మమననం ఆత్మచింతన - వీటి ద్వారా ఆత్మదర్శనమును పొంది ఆత్మరుతుడూ ఆత్మ క్రీడుడు ఆత్మ మిధునుడూ అయియుండునని శ్రుతి చెప్పుచున్నది. ఆత్మవిజ్ఞానమునకు

తగినంత యోగ్యతము పొందవలయుననువాడు రాగ ద్వేషములు లేని విషయసేవను అని వార్య మయినంత మాత్రమే చేయుచూ అంతర్ముఖముగా తత్త్వాన్వేషణా పరుడుగా ఉండవలయునను దానిని బ్రహ్మచర్యము అనుమాటతో తెలియవలెను.యతులు అనగా ఆత్మతత్త్వమును కనగొనుటకు ప్రయత్నము చేయుచుండు వారు నిత్యమూ సత్యరతులుగా ఇంద్రియములనూ మనస్సును ఏకాగ్రము చేసికొనుచూ జ్ఞానమునకు కారణ మయిన తప్పు నడతలను మాటలను పూర్ణముగా త్యజించి విషయాసక్తిని త్యాగము చేయుచూ హృదయాంతరాళమందున్న చిన్మయమైన ఆత్మను కనుగొందును. అనునది శ్రుతియొక్క ఆశయము, ఇదే అభిప్రాయమును భగవద్గీత ఒక శ్లోకనుందు ఇట్లు వర్ణించినది.

**అహకారం బలం దర్పమ్ కామమ్ క్రోధమ్ పరిగ్రహమ్।**

**విముచ్య నిర్మమః శాన్తో బ్రహ్మభూయాయ కల్పతే॥ (గీ 18 -53)**

అతను అత్మయందే నిలుచొనవలయునను తీవ్రనుగు కాంక్షకలవాడు ఇంద్రియములను నిగ్రహించుకొని, అహార విహారములయందు సాత్విక సేవనే చేయుచూ ఏకాంతవాసమును అవలంబించి నిత్యమూ ధ్యానయోగమందే తాత్పర్యము కలవాడుగా ఉండవలయును. అహంకారము, బలము, దర్పము, కామము, క్రోధము మొదలగు వాటినన్నిటిని పెరికివేసి అంతర్ముఖుడుగా ఆత్మ చింతనయందే నిల్చొనవలయును. కాశి యాత్రకుపోయి తీర్థస్నానము, శ్రాద్ధము, దేవతాదర్శనాదులు, మొదలగువాటిని చేసికొని వచ్చెదనను కొనువాడు ఎట్లు దుర్వ్యసనములను, దుర్వ్యవహారములను వదిలి బయలుదేరినచో అతని తీర్థయాత్ర ఎట్లుప్రయోజనకారియగునో అట్లే ముముక్షువుగా ఆత్మ దర్శనముకని ఆత్మధ్యానమందే కాలమును గడుపుచుండవలయును. ఇటువంటివానికి బ్రహ్మప్రాప్తి కలుగునని చెప్పవలసినదేమున్నది ? అతను తాను నిత్యము బ్రహ్మే అయియున్నానను బ్రహ్మభావననే పొందును.

**సర్వం తంపరదాద్యే న్య త్రాత్మనః సర్మవం వేదేదం బ్రహ్మేదం**

**క్షత్రమిమే లోగా ఇమే దేవా ఇమాని భూతానీదం సర్వం యదయమాత్మా॥ (బృ 2-4-6)**

కర్మకు కావలసిన బ్రాహ్మణ్యాదులు, దేవతలు, లోకమును సర్వభూతములు ఎక్కువ ఎందుకు ? ఏమేమి కనబడుచున్నదో ఇదంతయూ ఆ ఆత్మే అను బుద్ధి వచ్చువరకు కూడా ఆత్మభావన వచ్చునట్లు తత్త్వవిచారమును చేయవలయును. మిగిలిన ఏదైనదాని, ఆత్మకంటే వేరుగా, ఉండుటయే లేదు. ఆత్మనే మనము 'నేను' 'మరియొకరు' 'వేదములు', 'దేవతలు', 'లోకములు' - అని వ్యవహరింతుతుందుము. ఈ తత్త్వమును వదని, 'ఇది జాతి' 'ఇది కర్మ' 'ఇదిమంత్రము' 'వీరు దేవతలు' 'ఇవి విషయములు' - అను భేగ భావనతో వ్యవహరించుటే ఆత్మతత్త్వము కంటే దూరమగుటకు ముఖ్యకారణము, ఏమేమి కారణమగుచున్నదో ఏమేమి వినబడుచున్నదో ఏఏ విచారము మనస్సునందు వచ్చుచున్నదే అదంతయూ నిజముగా ఆ పరమాత్మ తత్త్వమే అనుదానిని కనుగొనుటకు ప్రయత్నించు మనో భావనయే ఆధ్యాత్మవిద్యకు ముఖ్యసాధనము.

భగవద్గీతయందున్న రెండు శ్లోకములను ఉదహరించి ఈ రోజు విచారమును ఉపసంహారము చేయుదును.

**ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశే ర్జున తిష్ఠతి ।**

**భ్రామయన్ సర్వభూతాని యన్త్రారూఢాని మాయయా ॥**

**తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత ।**

**తత్ప్రసాదాత్పరాం సాన్తిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్ । (గీ 18-61-62)**

ఈశ్వరుడే సర్వభూతముల హృదయమందునూ, ఆత్మగా ఉండియున్నాడు. అయిననూ ప్రాకృతజనులు మాయకువశులై విషయాసక్త చిత్తులుగా యంత్రములపై పెట్టి ఉన్న బోమ్మలు ఎట్లు తిరుగుచున్నవో ఆట్లు తిరుగునట్లు సంసారమునందు కష్టపడుచున్నారు. పుణ్యపరిపాకమైన సాత్విక జనులుమాత్రమే ఆ భగవంతుని శరణుపొందుదురు. ఆయనే మనకు గతి అని సర్వప్రకారముల (విధముల) ఆయననే శరణు పొందినవానికి ఆయన అనుగ్రహము కలుగును. ఆయన దయవలన పురాపృత్తిలేని ఆయన శాశ్వత స్థానముయొక్క ప్రాప్తియే కలుగును.

ఈ లోకమందు జనులు 'నేను దీనిని చేయవలయును, దానిని చేయవలయును' అని కర్తవ్యపరీయణతను చూపించుకొనుచూ కర్మ పరవశులై 'ఈ పని అయినది' , ఇక దానిని చేయవలయును' "దీనిని సంపాదించినట్లయినది : 'దానిని సంపాదించుకొనవలయును" అన్నిగునుగకు కట్టిన ఎద్దులవలె మరలమరల కర్తవ్యములను మనస్సుకు అంటించుకొని శ్రమపడుచున్నారు. అయితే ఎవరు ఆ భగవంతుని చేరుటొకటే ఈ జీవితమందు ముఖ్యమైన ధర్మమని మిగిలిన ఏ ధర్మములూ వద్దు అని ఆయననే శరణజొచ్చుదురో వారిక ఆ కరుణాళు వైన భగవంతుడు వారి ధర్మాధర్మ బంధములను చేధించి వారి శోకమోహములను తొలగించును. ఇదే భగవంతుడు అర్జునునికి చివరలో చేసిన ఉపదేశము.

**సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ।**

**అహం త్వా సర్వపాపేభ్యోమోక్షయిష్యామి మాశుచః (గీ -10-63)**

ఈ ఉపదేశమును చక్కగా తెలుసుకొని భగవంతునికి శరణాగతులమై మనము కృతార్థులమగునట్లు శ్రీ మన్నారాయణుడు మనందరిని అనుగ్రహించునుగాక.

ఓం తత్సత్